# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని

శ్రీ కోకా వెంకటరామానుజులు నాయుడుగారు రచించినది

తెనుగులో, శ్రీమద్భగవద్గీతకు ఇంత చక్కని మహాభాష్యం మరొకటి లేదు. శ్రీ నాయుడుగారు భగవద్గీత అంతా చిరకాలం పారాయణచేసీ, మననంచేసీ, మథించీ తాము తెలుసుకున్న గూఢార్థాలన్నీ లోకశ్రేయస్సు కోరి యీ గ్రంథరూపంగా భద్రపరిచి మనకు ప్రసాదించారు. వారు, ప్రతి శ్లోకానికి ముందు ప్రతిపదార్థం ఇచ్చారు. తరువాత ప్రశ్నోత్తరాల రూపంగానూ వివరణరూపంగానూ గూఢార్థాలన్నీ ఉల్లేఖించారు. ఈ గ్రంథం పరిశీలించకుండా ఎవరైనా సరే "మేము భగవద్గీత చదివాము" అను వాదం సాహసం అనిపించుకుంటుంది. రాయలు సైజువ 724 పేజీలూ 16 పేజీల అవతారికా గల గొప్పగ్రంథం. కాలికో బైండు చెయ్యబడ్డది.

కాని వెలమాత్రం పరమ సులభం 6-0-0

---

# శ్రీ త్యాగరాజస్వామికీర్తనలు

సంపాదకులు — ఘృతస్థానం నరసింహాభాగవతులవారు.

ఇందులో, మేళకర్త రాగాల వరుసను 505 కీర్తనలూ, 19 పక్వరింపు కీర్తనలూవున్నాయి. ఘనరాగపంచకం కీర్తనలకుమాత్రం మొదట స్వరం చేర్చబడి వుంది. తక్కిన కీర్తనలన్నీ మూలం మాత్రమే ముద్రించబడ్డాయి. కఠినపదాలకు అర్థమున్నూ తెలుపబడ్డది. 16 పేజీల శ్రీ త్యాగరాజస్వామిచరిత్ర గలదు. మొదట మేళకర్తరాగాలవరుసనూ, చివర అకారాదిగానూ కీర్తనల సూచిక చేర్చబడ్డది. దళసరి కాగితాలు. చక్కని బైండు. వెల 5-0-0 మాత్రమే.

---

# మంగళహారతులు, శ్రీకృష్ణసేవ.

శ్రీమతి కొచ్చెర్లకోట వీరలక్ష్మమ్మగారు రచించినవి.

ఈ రెండు పుస్తకాల్లోనూ స్త్రీలకు అందుబాటుగా ఉండే శైలిలో చక్కని మాదిరులలో 150 పాటలకు పైన్నీ కూర్చబడి ఉన్నాయి. అన్నీ భక్తిరసం ఉట్టిపడేవి. శ్రీరామ, శ్రీకృష్ణుల సేవను తెలియజేసేవి. దేనికదే వెల 1-0-0

---

[illegible] పుస్తకములు [illegible] షాపులలోను ఈ వరలకు దొరుకును

# సువిశాల మిదం విశ్వం

రావు వేంకట మహీపతి గంగాధర రామారావు

పిఠాపురము యువ

ఏమి టా ప్రయా

ఎట్లా వర్ణించటం !

Fir హాం నే




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# 1. ప్రయాణం

ప్రయాణం అనేది ఒక గొప్ప సంస్థ. మానవుడు చేసే పనుల్లో ఒక గొప్పపని.

రైలు ప్లాట్ఫారమ్ దగ్గరవేచి ఉంది—మనసీట్లు సిద్ధంగా ఉన్నాయి—వానిని సమీపించగానే ఏదో ఉద్వేగం, ఏదో ఆనందం, ఏదో క్రొత్త!

స్టీమరు కదలనానికి సిద్ధంగా ఉంది—ఏమి టా ప్రయాణీకుల హడావడి, ఏమి టా ఉత్సాహం! ఎట్లావర్ణించటం!

విమానం బయలుదేరనానికి సన్నాహం చేస్తుంది-విమానంలో వెళ్లేవాళ్ళ మనోభావాలని ఎవరు చిత్రించకలరు?—వారి ఉహ్వాంగులను ఎవరు ఎదిరించకలరూ?

కారు, సైకిలు, జట్కా-బండి, రాధారిపడవ!—వీనిలో ప్రయాణానికి మాత్రం హడావడిలో లోపం ఏ!

సిగరెట్లు కాల్చుకుంటూ బెత్తం ఊపుకొంటూ నడిస్తేనేం, చుట్టనవ్రుల్తూ కిఱుచెప్పాలమీాద యానం ఐతేనేం,—ప్రయాణం ప్రయాణమే!

నిజంగా చూస్తే ప్రయాణం చేయటంలో సుఖంగా ప్రయాణంచేయాలని ఉన్నా, ప్రయాణానికి సౌకర్యంతో మరీ ఎక్కువసంబంధంలేదు. యానంకావటమే సౌకర్యం — అదే

అందం — అందులోనే ఉద్రేకం, భావోత్సాహం — అదే ఆనందం—

వెళ్ళటం అనేది ముఖ్యం — గమ్యస్థానం కూడా అనవసరం ఏమో!—అంతా ఒక నూత్న భావం—అదే ప్రయాణ భావం—

గమనం—అదే కావలసింది—ఎక్కడినుంచి ఎక్కడికో! అది త్యాజ్యం—

గమ్యస్థానంలో మనకిపనిఉండవచ్చు. అందుకే ప్రయాణం కూడా చేయవలసివచ్చి ఉండొచ్చు—కాని అది ప్రయాణ భావానికి ప్రయాణానుభవానికి ఏమాత్రం ముఖ్యంకావు—

అన్నిటికి అన్నిటికీ సంబంధం అనే మిట్టవేదాంతాన్ని అలా ఉంచేస్తే ముఖ్యమైన విషయాలతోనే సంబంధం చూసుకోవాలి.

అలాచూస్తే ఈ ప్రయాణ భావానికి దేనితోసంబంధం లేదు! స్వయం ప్రకాశకం ఐ, తనకుతానే ఆధారం ఐ, అద్వితీయమై ఈభావం ఉప్పొంగిపోతుంటది.

ప్రయాణ భావం పొంగి పొరలు తున్నప్పుడు రైలు వంతెన పైనుండి పడిపోవునని కాని, నావ సముద్రంలో మునిగి పోవునని కాని, విమానం ఆకాశం నుండి ముక్కముక్కలుగ పడిపోతదనికాని ప్రయాణికులు తలచనే తలపరు.

ఆతలపే ఉంటే ప్రయాణమే చేయరేమో! — ఐనా అలాంటి ఊహాలకి ఈ భవ్యభావంలో తావేదీ ?—

ప్రయాణాభిలాషులు మహాయోగులని, మహావేదాంతులని, నిజం ఐన కర్మయోగులని ఊహించాలి — ఆ యభిలాష యిచ్చేభావం, అతిశయం, ఉత్సాహం, ఆనందం, మగత, మనోశక్తి ప్రపంచం అందుప్రేమ దానియెడల నిర్లక్ష్యం, ప్రయాణిక బృందాన్ని ఒకమహాబృందంగా ఉన్నతపథంలో ఆడించివేస్తాయి —

ప్రయాణాంతాన్ని హిమాలయ పర్వతం ఉన్నా, హిందూ మహాసముద్రం ఉన్నా, నాగరిక శేఖరులున్నా, అనాగరిక సామ్రాట్టులున్నా, హంసతూలిక తల్పాలున్నా, కుక్కి నులకమంచంఉన్నా, స్వర్గలోకంఉన్నా, నరకలోకం ఉన్నా, నిజం ఐనప్రయాణికుడికి, సత్యమైన ప్రయాణాభిలాషికి ఒకటే—ప్రయాణం ఏ ముఖ్యం—కదలికయే ఆనందం — ప్రస్తుతంలో యాత్రాశ్రమా నముదాయాన్ని వీలైనంతవఱకు నొక్కివేస్తూ, చలికి వణకుచూ, చంద్రకాంతికి హాయి అంచూ, వేడికి ఉస్సురంచూ, ప్రకృతిసౌందర్యానికి సెహాబాసు అంచూ, చిరునవ్వుతో, ఒకకన్నుమూస్తూ ఇంకోకన్ను తెరుస్తూ, గమనానందంలో వీలైనంత, అన్నివిధాలైన ఆనందాన్ని రాబట్టుచూ, సాగిపోయే ఈప్రయాణికుడు ఉత్తమమానవుడుకదా!

ఈప్రయాణికులలో ఉత్తముడెవడంటే: పనిలేకుండా, గమ్యస్థానం ఏ లేకుండా, టికెట్టైనా కొనకుండా ప్రయాణంకో

పయాణం అయ్యేవాడే! — వాడు స్వేచ్ఛామూర్తి. మానావమానాలతో, మానవాభిప్రాయంతో సంబంధంలేని మహామూర్తి.

ఈ ప్రయాణికులలో అధములెవ్వరంటే ప్రయాణానం దాన్ని సంపూర్తిగా అనుభవించక, గమ్యస్థానమందు తాను చేయబోవుచున్న, కోర్టు వ్యవహారం విషయం ఓ, లేక ధనార్జన విషయం ఓ, ఆలోచిస్తూ, బధిరునిమోస్తరు, అంధునిలాగున యానం అయేవాళ్ళే! వాళ్ళకి ముక్తి లేదు.

ఇక ఉంకోమాట: ప్రయాణం చేస్తున్నప్పుడు మనుష్యుల మానవత్వం ద్విగుణీకృతం ఔతది, క్రొత్తగా సృష్టింపబడతది. (మంచిది కానీయండి, చెడ్డది కానీయండి, దాని విచారణ అప్రస్తుతం) — కవి అఖండంగా రాస్తాడు, భోక్త రెండంతలు భోజనం చేస్తాడు, గాయకుని రాగాలాపనలో స్థాయి ఉచ్ఛస్థానానికి పోతది, నిద్రపోయేవాడు ఇంకో అంత నిద్రపోతాడు, కాముకి స్త్రీని మరీ కామంతో నొక్కుతాడు.

పిల్లికి బిచ్చంపెట్టనివాడు ఒక కానీ గ్రుడ్డిదానిమీద విసరి వేస్తాడు—ఆకలిలేనివానికి ఆకలి. నిద్రలేనివానికి నిద్ర. సన్యాసికి స్త్రీవాంఛ—ప్రియురాలి తొడపై పడుకొన్న కాముకునికి వేదాంతాలోచన. భీరునికి ధైర్యం—ప్రాణంమీద ఎంతో ఆస ఉన్నవానికి తృటికాలంలో ప్రాణంపై తృణీకారభావం —

ఆహా! ఎటువంటి సంస్థ ఈ ప్రయాణం! ఎటువంటి ఆధిక్యంకలది ఈ ప్రయాణభావం!—

మానవ నిర్మితంలో మానవాతీతం ఐంది ఇదే కాదూ?—

కాబట్టి అందరికీకావాలి ఈప్రయాణం — అదే విశ్వప్రయాణం ఓ!—

# 2. ప్రేమ

ప్రేమ అంటే తెలియని జీవిలేదు — అందరికీ సాధారణంగా ఆ అనుభవం కొద్దో గొప్పో ఉండితీరాలి.

జీవులలో ఉత్తముడనే మానవునినుండి అధమమనుకొనే క్రిమివఱకు (ఈజీవులలో చెట్లు మొదలైనవి కూడా ఉన్నవి) ప్రేమ జీవనంలో మునగాలి.

ప్రేమ అనంతం అని కొందఱన్నారు — ప్రేమ జీవనానికే కాకుండా సృష్టికే ఆధారం అన్నారు కొందఱు ప్రేమే దేవుడే అన్నారు మరికొందఱు—

ప్రేమ పవిత్రమైనదన్నారు. ప్రేమ అపవిత్రమైనదన్నారు. ప్రేమ క్రూరమైనదన్నారు. కల్లోలాలికి కారణం అన్నారు. ప్రేమ శాంతిస్థాపనానికి మూలం అన్నారు. ప్రేమ సృష్టిస్తదన్నారు. ప్రేమ నాశనం చేస్తదన్నారు.

ప్రేమ మంచిది. ప్రేమ చెడ్డది. ప్రేమ మంచిదీ చెడ్డదీ కానిది కూడా !

కాని ప్రేమ ఏమిటో సరిగ్గా తెలిసికోటం చాలా కష్టం—కాలం అంతదీర్ఘం ఐ, అవకాశం అంత వైశాల్యం కలిగి, రాళ్ళకంటె సామాన్యమై, అమృతంకంటె అపూర్వం ఐ, చేదుగలిగి, తీపిలో కరిగి, భూకంపమై పొంగుకడలియై రంగుల

కల ఇంద్ర ధనుస్సై, మెరిసే మెఱుపై, అశనిపాతం ఐ, ఆక్రోశ రావమై, ఆనందభైరవి రాగాలాపనయై, కన్నీరై, చిరునవ్వై ప్రేమ అనేపేరుతో విజృంభిగుచున్న ఈ తత్వం, ఈమనోభావం ఎందుకంత దుర్గ్రాహ్యమో, అంత విశ్వవ్యాపకత్వం కలిగి కూడా! —

కాని వస్తుతత్వంతో అంతగొడవ ఎందుకు? — తత్వ గ్రహణ అనవసరం ఏమో! అనుభవం చాలు — అదే తత్వ గ్రహణ అని సంతోషించొచ్చు!—

పాలలో పానకం వేస్తేనేం. పన్నీరు వేస్తేనేం!—ఆస్వాదనం ఏకా ముఖ్యం — అందులోనేకా అనుభవం? —

హాలహాలం నల్లదైనా, నీలందైనా ఒకటే!— అమృత తత్వ విషయం ఐ వివాదం త్యాజ్యం — ఆస్వాదనం ఏ కార్యం —

పుష్పం గులాబీ ఐతేనేం, మల్లె ఐతేనేం, సౌరభం ప్రోలితే చాలే!

రక్తం వేడిగా ఉన్నా, చల్లగా ఉన్నా రక్తంవేకాదో!

అనుభవం— అనుభవం!— అనేక రంగులు, అనంత రూపాలు, వివిధపరిమళాలు, వేరువేరు రుచులు.

ఒక మహా సామ్రాట్టు ఒక పరకీయకోసం మహా సామ్రాజ్యం త్యజించేనేడు — వారి అన్యోన్య సంపర్కంలో

వారి అధరామృతంలో వారి ఆలింగనాలలో వారి కలలలో ఒక ఉత్తమోత్తమ సామ్రాజ్యం, స్వర్గరాజ్యం స్థాపింప బడినది —

ప్రేమ చేసిం దావని.

మహారాజు కౌగలిలో గారవింపబడుచున్న మహారాణి, మహారాజు వక్షం కత్తితో పొడిచి పాలికాపుతో పరదేశం పోయింది.

ప్రేమ చేసిం దీవని.

ఒక ఇరువురు భార్యా భర్తలు ఆ జన్మాంతం ప్రేమించు కొన్నారు.

ఇంకొకరు — ఆ జన్మాంతం ఒకరి నొకరు మోస గించేరు—

అదీ, ఇదీ ప్రేమ చేసింది.

ఒకడు చచ్చిపోతే ఒకతె సహగమనంచేసింది — ఇం కొకడు మంచంమీద పండుకొని యుంటే ఇంకొకతె వాడి మెడను నులిపివేసింది — రెంటికి కారణం ప్రేమ —

కొన్ని దినాలు కొందరు ప్రేమించుకొన్నారు — తరు వాత కొత్త ప్రియులతో కులుకుచు పాతవి మరచిపోయేరు —

మహా రోగి మంచం మీద మైమరచాడు — కురూపి ముఖంలో మహా సౌందర్యం చూచేడు —

ఇది అంతా ప్రేమచేసింది.

ఒకడిని ప్రేమిస్తూ ఇంకొకరి ప్రక్కలో కులికింది— ఒకతెను అనుభవిస్తూ ఇంకొకతెను తలచేడు—రెండూ ప్రేమే !—

ఒకతెను ఒకడు అపారంగా ప్రేమించేడు ; ఆమె అతనిని మోసగించింది, త్యజించింది — ప్రేమించనేలేదు—కాని ఇంకొకతె అతనిని ఏకధాటిగా ప్రేమించింది — కాని అతడు ఆమెను నిరాకరించేడు— ఇదంతా ప్రేమే

కొందరు ఒకేమారు ఎంతమందినో ఆశించేరు—

ఒక ఇద్దరు ఒకరి నొకరిని మాత్రమే వాంఛించేరు ఆజన్మాంతం, తరువాతను.

రెండూ ప్రేమే !

ఒకడు కుక్కని సాకేడు—ఒకతె గుఱ్ఱాన్ని పోషించింది —

పువ్వులు ముద్దు పెట్టుకొన్నాడు ఒకడు—నక్షత్రాలు చూచింది ఒకతె ! ఇవి అన్నీ ప్రేమే !—

తల్లీ కొడుకుల కొక సంబంధం—అన్నా చెల్లెళ్ల కొక సంబంధం —

పురుషులలో ఒకభావం—స్త్రీకీ స్త్రీకీ ఒక స్నేహం-

మృగానికీ మృగానికి, పిట్టకు పిట్టకు, క్రిమికీ క్రిమికీ, పువ్వుకు పువ్వుకు, ఆకర్షణ —

ఇదంతా ప్రేమసామ్రాజ్యం —

ఇదంతా చూస్తే ప్రేమ అనేది ఒకటి కానే కాదేమో! వేరు వేరుభావాలకి, వేరువేరు ఆకర్షణలకీ, వేరు వేరు పేర్లు పెట్ట లేక, కలగాపులగం క్రింద, కదంబం క్రింద, చీపురుకట్టతో తుడిచి వేసినట్లు, సముద్రం ఆక్రమించినట్లు ప్రేమ అనే పదాన్ని సృష్టించేసేరో !—

మనుష్యులకు సరియైన అర్థంతో పనిలేదేమో ! లేక మొండి తనంలో రుచి ఉందో ! కాకపోతే తెలిసీ తెలియని స్థితి వాంఛిస్తారా ?

లేక ప్రేమ అనేది భావాతీతం కొటచేతనూ, విశాలం ఐనది కొటచేతనూ, అత్యంత వివిధమైంది కొటచేతనూ, దానికి సరియైన వివరణం, ఆ ప్రేమభావాలకు సత్యమైన నిర్వచనం మానవాతీతం ఐ ఉండాలి !—

బాగా చూస్తే సత్యానికే నిర్వచనం అసాధ్యం !

## 3. కొండలు, - లోయలు

కొండలు ఎక్కాలని కోరిక లోయలు దిగాలని కుతూహలం ఔన్నత్యమైన తారాపథం యందు ఆశ అత్యంత నిమ్నమైన పాతాళమందురుచి! — అదే మానవ హృదయం వానిమధ్యనే మానవజీవితం.

కొండ ఎక్కిన కొలది లోయలోతు ఎక్కువౌతది! — లోయదిగిన కొలది కొండ ఎత్తు ఎక్కువ ఔతది! కొండలు లోయలు అన్యోన్యం ఆధారపడి ఉన్నాయి — ఒక విధంగా చూస్తే లోయలేకపోతే కొండలేదు, కొండలేకపోతే లోయ లేదు.

లోయలో ఉన్నంతసేపు కొండ ఎక్కాలని, కొండ మీదున్నంతసేపు లోయలో దిగాలని.

అందుచేత, కొండకిలోయకి మధ్యను ఉన్న సమాన ప్రదేశంపై నివసించుట మంచిది. అప్పుడు తారాపథం మీద, పాతాళంమీద కూడ అభిరుచి ఉంటది. ఆవిధంగా జీవితంపై రుచికూడ ఎక్కువ ఔతది; జీవితానికి క్రొత్తకళవస్తది.

పర్వత శిఖరాలమీద గాలి, చల్లగా ఉంటది, దుమ్ము తక్కువ. మేఘాలను ముట్టుకోవచ్చు, ఆకాశంతో ఆడుకో వచ్చు, ఇంద్రధనుస్సులో స్నానం చేయవచ్చు, మానవ ఘోషకి దూరంగా ఉంటాం.

చుట్టూ ఉన్న సర్వవస్తుతతి దృష్టికి సుగోచరం వస్తు సముదాయం తమ ప్రత్యేకత్వాన్ని సూచిస్తూ సర్వంలో కలిసి పోతది. ఎత్తునుంచి, దూరాన్నుంచి చూడటంవల్ల అనాకారం కూడా కనుపించదు.

కాబట్టి పర్వతారోహణం అంతతీపి. కాని కొందరికి ఒక చీనా వేదాంతి వక్కాణించినట్లు కొండ చివరికి ఎక్కితే చుట్టూయున్న మేఘాలవల్ల ఏవీకనుపించదని అక్కడకి వెళ్లటం యిష్టం. కొందరికి కొండ ఎక్కటం అనేదే ముఖ్యం. అందు చేత వారు పర్వతారోహణం చేస్తారు.

కాని ఎక్కువ కాలం పర్వత శిఖరాల మీద ఉండ లేరు. కొంతకాలానికే చల్లదనం చలిక్రింద మారతది — మేఘాలపై విసుగు పుడతది. సముద్రదేశం మీద నున్న వస్తు సముదాయం నిజరూపంలో కనుపించక సూక్ష్మత దాల్చటం వల్ల వాని సహజరూపం కోసం ఆశ పెరుగుతది.

ఎక్కటానికి ఇంకేవీ లేకపోవటంవల్ల నైతేనేం, ఎక్క టానికి ఇంకా శిఖరాలు ఉన్నా అసలు ఎక్కటం పైనే విసుగు పుట్టటం చేతనైతేనేం, ఎందుచేతనైతేనేం, ఇక దిగాలని ఉవ్విళ్ళూరుతారు — ఆకాశ విహారం ఇష్టం ఐనా భూలోక వాసంపై మక్కువ ఏలాపోతదీ!

ఇక అదేపనిగా దిగుతారు — మహానందంతో దిగు తారు. అసలు ఆరోహణం ఏ తప్పని నిశ్చయించు కొంటారు.

దిగే ఆ ఉద్వేగంలో పర్వతావరోహణం చేసి సమ ప్రదేశాన్ని, భూమిని, స్వస్థానాన్ని చేరికూడా గమనించక ఇంకా దిగుతారులోయలోనికి —

లోయ, వెచ్చనైన లోయ, భూగర్భం, మాతృ గర్భం, చాపిన వెచ్చని హస్తాలతో ఆహ్వానిస్తుంటే ఆగ గలరా!

లోయలో అంధకారం ఉంటేనేం? నిద్రపోవచ్చునే హాయిగా! ఒక వేళ వేడిగా ఉంటేమాత్రం ఏం? సెలయేళ్ళలో స్నానం, ఇసుక తిన్నెలపై విహారం చేయవచ్చుగా!

కాని అక్కడ కూడా కొలది కాలంపే మకాం — తరువాత ఊపిరితీయటం కష్టం మళ్ళీ భూసమప్రదేశం చేరాలి — ఆ సమప్రదేశాన్ని విడిచిపెట్టి సమప్రదేశం మీద ఉండే మానవుడు ఎక్కువ రోజులు, పాతాళానైనా, తారాపథానైనా ఉండలేడు.

వాడికి అలాంటి శక్తిఏదీ? శక్తి ఉన్నా వాంఛ ఏదీ?

తారాపథాన్ని, పాతాళాన్ని కూడా ఊపిరి సలపదు. ఒకచోట గాలి మిక్కిలి పలచన, మరి ఒకచోట గాలి మిక్కిలి దట్టం — కారణాలు వేరైనా ఫలితం ఒక్కటే! — అదే అనుభవం- అనుభవంకాదూ సత్యమైన మానవజీవితం !—

కొండ ఎక్కటం, లోయదిగటం ; — మానవుని చరిత్ర

— దానికి అర్థం ఉండొచ్చు, లేకపోవచ్చు, ప్రతిదానికి అర్థం ఉండాలని అనుకోటం అత్యంతం ఐన ఉన్మాదం?

సూర్య చంద్రులగతికి, గాలి వివనలకి, భూకంపాలకి, ఇంద్ర ధనస్సుకి, పిట్టలకూతలకి, పుట్టటానికి, బ్రతకటానికి, చావటానికి, మానవహృదయానికి, మానవ జీవితానికి, అర్థం లేదు — అర్థం ఉన్నా అది అర్థంకాను మనకి.

తెలియ శక్యంకాని అర్థాలకోసం చేతులు చాచటం అనవసరం. అర్థంలేని వానికి అర్థంకల్పించటం అవ్యక్తం! — కలలలో వలవరింతలు వద్దు — కుక్కకి ఐదు కాళ్ళు ఇయ్య వద్దు! —

దృశ్యమే ద్రష్టవ్యం — చూడండి చీమలబారు లాగు ఎంతమంది కొండను ఎక్కుతున్నారో! ఎంతమంది కొండను దిగుతున్నారో! వాళ్ళ పనులని చూడండి — పువ్వులు కోస్తున్నారు; రాళ్ళనిమోస్తున్నారు. మెట్లు చెక్కుతున్నారు. గుహలు తొలుస్తున్నారు. చెమట తుడుస్తున్నారు. గాలికి ముసుగు వేస్తున్నారు. పండ్లు తింటున్నారు. నీరు పానం చేస్తున్నారు.

అదే ఎక్కుతున్నారు అదే దిగుతున్నారు మరి కొందరు. కొందరు కూర్చున్నారు. కొందరు నిద్రపోతున్నారు. కొందరు నోరువిప్పి అరుస్తున్నారు.

తిట్టుకొంటున్నారు కొందరు. మరికొందరు ముద్దుపెట్టు కొంటున్నారు. కన్నీళ్ళలో కరిగేరుకొందరు, చిరునవ్వులో చెలరేగేరు మరికొందరు.

మేఘాలు కొందరికి ఇష్టం. వెచ్చని మట్టి మరికొందరికి ఇష్టం. ఇందులో అందులో కాలు వేసేరు మరికొందరు.

వాళ్లుచేసేపనులకు లెక్కలేదు. వాళ్లుచేయని పనులకు లెక్కలేదు.

చూస్తూ చూస్తూ ఉంటే చీమలబారు లాంటిమనుష్యులు వాళ్ళు ఎక్కుతూ దిగుతూ ఉన్న కొండలు లోయలు ఒకేసంస్థగా ఐపోయినట్లు తోచింది!

మనుష్యుల కోసం కొండలు లోయలున్నాయో, కొండలు లోయలకోసం మనుష్యులున్నారో నిర్ధారణ అప్రస్తుతం!

# 4. నవ్వు — ఏడ్పు.

మనుష్యులు తమ భావ ప్రకటన కోసం ఎన్నో ధ్వనులని సృష్టించేరు. మృగాలు, పక్షులు మొదలైనవి ధ్వనిచేసినట్లే వీళ్లు కూడాచేస్తారు. కానివీళ్ళధ్వనులలో రెండురకాలు ఉన్నాయి. ఒక రకం శబ్దముయొక్క అర్థంవల్ల భావప్రకటన చేయనానికి వీలైనవి. వాటినే మాటలంటూరు. రెండవది శబ్దమాత్రంచేత మనోభావంయొక్క ప్రకటన చేసేవి.అంటే తుమ్ము, దగ్గు మొదలైన శబ్దాలు. అవి ఒకవిధంగా చూస్తే అప్రయత్నశబ్దాలు స్వయంభూలు—నవ్వు, ఏడుపుకూడా ఈ రకంలోనివే!—

ఆ నవ్వూ, ఆ ఏడుపూ ఎంత అసాధ్యం ఐనవో చూచేరా! నయాగ్రాజలపాతాన్ని బంధించి శాసించవచ్చు; యాంగ్‌ట్సీకూ నదిని ఆపవచ్చు. హిమాలయ పర్వత శిఖరాలని కాలిక్రింద త్రొక్కవచ్చు; పసిఫిక్ మహాసముద్రాన్ని తరచవచ్చు; ఉత్తరధృవములో ఒక గంతువేసి దక్షిణధృవములో దిగవచ్చు. నక్షత్రయాత్రచేయువచ్చు. నుదుట వ్రాయబడిన విధినికూడా మనుష్యయత్నంవలననో దైవసహాయం వలననో మార్చివేయ వచ్చు; కాని నవ్వును, ఏడుపుని సంపూర్తిగా అరికట్టటం అసాధ్యం. సాధారణంగా సహజంగానవ్వు ఏడ్పులువచ్చేస్తాయి. మనం గిలగిల కొట్టుకొని ఎంత ఊపిరి బిగబట్టి ముఖాన్ని ఎన్నివికారాలుగా పెట్టుకొనినా నవ్వు

ఏడుపుల ప్రభావాన్ని కొంతవరకైన చూపకుండా, అనుభవించ కుండా ఉండలేము.

కాని ఎంతమంది నిజముగా నవ్వేవిధంగా నవ్వగలరూ? అదేవిధంగా ఎంతమంది ఏడ్చేవిధంగా ఏడ్వగలరూ? ఏడ్చినంత మాత్రాన్ని ఏడ్చినట్లుకాదు; నవ్వినంతమాత్రాన్ని నవ్వినట్లు కాదు. దేశకాల పాత్రాన్ని బట్టి సన్నివేశం గమనిస్తూ సమయోచితం గ్రహిస్తూ నవ్వాలి; ఏడ్వాలి. అదేనవ్వవలసిన నవ్వు; అదేఏడ్వవలసినఏడ్పు. అదొకవిద్య. అత్యావశ్యకం ఐనవిద్య—

నవ్వుచూడండి. ఎన్నివిధాలో! నాల్గు విధాలు కాదు. నలభైనాల్గు విధాలో లేకపోతే నాలుగు వందల నాలుగు విధాలో!— దీనిగురించి చాలామంది చాలా వ్రాసేరుకూడాను.

నిజంగా చూస్తే నవ్వకుండాఉండే నవ్వు దగ్గరనుంచి, చిరునవ్వునుంచి, పకాపకా అనేనవ్వువరకు, నవ్వో ఏడ్పో ఉపద్రవసంబంధమైన ప్రళయధ్వనో మరి ఇక ఏదో అని నిర్ణ యించుకోనానికి వీల్లేని నవ్వు వరకు ఉండే గిలిగింతలు కలుగ చేసి, ముఖ వికారాన్ని ఉత్పత్తిచేసే భావప్రకటనలన్నీ నవ్వులే. ఇన్ని నవ్వులున్నాయి కాబట్టి ఈ నవ్వు ఈవిధంగా ఈ సమ యాన్ని దీనికోసంఅని వర్ణక్రమపట్టిక ప్రకారం జాబితాఇచ్చి హాసనుశాసనత్వం స్వీకరించి నవ్వు వాక్కే-కాబట్టి అభినవ వాగనుశాసన బిరుదును పొందాలని రచయితకు ఏమాత్రం

ఉద్దేశం లేదు! కొన్ని కొన్ని నవ్వులను ఉదహరించి నవ్వు టంలో ఉండే వివిధత్వం, సూక్ష్మత, అందులో ఉండవలసిన వివక్షణ, సమయజ్ఞత, ఆనందం, అందం పాఠకుల ధీబలంపైన విడిచి పెట్టేయాలని, ఊహ; ఊహ, శక్తినిబట్టి ఉంటది!

ఇదోరకం నవ్వు: ఏ హిట్లరో, ఏ ముసోలినియో చాలా మందిని చావ మోదుతాడు, ఏ తెల్లవాడో ఏ నీగ్రోనో కాలు సాగదీసి తన్నుతాడు. కొన్నాళ్ళకు ఆ హిట్లరుని ఆముసోలినీని చాలామంది కలిసి చావ మోది క్రిందికి లాగేస్తారు. అదే విధంగా ఆ తెల్లవాడిని కొన్నాళ్ళకు నల్లవాళ్ళు కొందరు కలిసి కాళ్ళు సాగదీసి తన్నేస్తారు. అప్పుడు చూస్తూన్న వాళ్ళు ఒక నవ్వు నవ్వేస్తారు. అది చాలా కమ్మనిదైన నవ్వు —

ఉంకోనవ్వు: భార్యమోసంచేసి పతివ్రతలాగ మాట లాడుతుంటే, ఆ సంగతి గ్రహించి ఆమె పాతివ్రత్యాన్ని నమ్మినట్లు చిరునవ్వునవ్వుతూ తన ఏకపత్నీ వ్రతాన్ని చాటు కొన్న దక్షిణనాయకుని నవ్వు.

విశ్వప్రయత్నంచేసి ఎంతోకాలం కష్టపడి, ఎంతో ఎత్తు ఎగిరి, తుదకు కార్యఫలం పొందలేక విఫలమనోరథుడై నేలపై చతికలపడి, ఆశక్తి వెల్లడించి, చిన్నగానో, పెద్దగానో నవ్విన మానవుని నవ్వుమరొకటి.

(చినిగినబట్టలతో, చీలినగుండెలతో క్షీణించిన ప్రాణాలతో

చితికిపోయిన జీవంతో ఆకాశంవంక చూస్తూ నవ్వుతాడొకడు. అదొకనవ్వు.

పడ్వలేక నవ్వేనవ్వొకటి. గిలిగింతవేస్తే నవ్వే నవ్వొకటి. గందోళీగాడి మొగ్గలికినవ్వే నవ్వొకటి.

పంచభక్ష్య పరమాన్నములతో భోంచేస్తూ మహైశ్వర్యంతో మత్తకామినుల అధరాలమీదనో, వక్షోజాలమీదనో పడిఉండి నవ్వేనవ్వు మరి ఒక రకపునవ్వు.

మెలకువలో నవ్వు; నిద్రలోనవ్వు; కలలో నవ్వు. ఇవి అన్నీ గ్రాహ్యాలే.

సమ్మతికి నవ్వు—అసమ్మతికి నవ్వు—సంతోషానికి నవ్వు; విచారానికి నవ్వు; కోపానికి నవ్వు; హాస్యానికి నవ్వు; పుట్టినప్పుడు నవ్వు; చచ్చినప్పుడు నవ్వు.

ఇంకా నవ్వులున్నాయి ఎన్నో; అందరూ నవ్వుతూంటే ఊరుకొని అందరూ నవ్వేసిన తరువాత ఆఖరిని నవ్విన నవ్వు ఒకటి—అదిచాలామంచినవ్వు—

ఇంకొకటి, ఎవరూ నవ్వనప్పుడు నవ్వేనవ్వు — అది చాలాగొప్ప నవ్వైనా, లేక పరిశుద్ధమైన అవక తవకనవ్వైనా కావాలి.

స్వరభేదంతో, మాత్రభేదంతో, వికారభేదంతో, కూడిన ఈ నవ్వు నిజంగా లలితకళలలో ఒకటి, అభ్యాసం

కూషువిద్యా ! ఆమాట మరచి పోకండి.

చీనా దేశంలో ఉమ్మివేయటం ఒక గొప్పనేర్పంట, నవ్వటం హిందూ దేశాన్నే కాదు, అన్ని దేశాల్లోనూ ఒక గొప్పనేర్వవలసిన నేర్పు.

నాకన్నిటిలోకి అందంగా కనుపించే నవ్వేదంటే ; ఒక కంటితో కన్నీళ్లు తళుకు కరిగిస్తూ, రెండోకంటితో చిరునవ్వు వెదజల్లేనవ్వు ! —

అబ్బ, నవ్వు చూచి చూచి విసుగు పుట్టింది — ఇక ఏడుపుచూద్దాం —

ఏడుపు కూడా గొప్ప విద్యలో ఒకటి ! లలితకళలలో అత్యంతలలితకళ. భావప్రకటనానికి, వైశాల్యానికి, సహజత్వానికి దీనిని మించింది ఉన్నదంటే నమ్మటంకష్టం — మనుష్యుడు వ్రాయటం మొదలు పెట్టినప్పటినుండి ఈరోజువరకు ఉన్న విశ్వసారస్వతం అంతా, భావప్రకటనానికి ఏడుపు తరువాతదే. ఏదీ దీనికున్న తీవ్రత, వాడి, విశ్వసారస్వతానికి ! వైశాల్యమందు మాత్రం దీనిని మించిన వస్తువు భూమిమీద ఏది? భూమి కూడా దీనికంటె తక్కువదే. ఎంచేత అంటే భూమియొక్క వైశాల్యం ఈ భూమితో ఆఖరు—కాని ఏడుపు భూలోకాన్ని ఆక్రమించటం ఏ కాకుండా భూమ్యేతరవస్తు సముదాయాన్ని, స్వర్గలోకాన్ని, నరకలోకాన్ని, మరణాంత జీవితాన్ని కూడా ఆక్రమించి ఉంది. సహజత్వంలోకూడా అగ్రస్థానాన్ని

పేడదిది. నీటికంటె, మంచుకంటె, గాలికంటె, సౌరభంకంటె ఇది సహజం ఐంది. ప్రకృతికంటె స్వభావికం ఐంది.

ఐనా అన్ని కళలలాగనే ఇది కూడా అభ్యసింపతగినది. ఎంతసహజత్వం ఉన్నా, ఎంతవైశాల్యం ఉన్నా, ఎంత తీక్ష్ణమైన సహజభావ ప్రకటన శక్తిఉన్నా, మహారోదనా మహాశాస్త్రం నిర్వచన రూపంగా సంపూర్తిగా అలవరచుకోనానికి కృషి అవసరం.

సాధారణంగా లలితకళలు స్త్రీజాతి సామ్రాజ్యంలోనివైనట్లుగా ఈరోదనం అనే లలితకళకూడా చాలవరకు స్త్రీసామ్రాజ్యంలోనిదే. అంచేతనే కాబోలు స్త్రీలు ఈ లలితకళలో చూపించేశక్తి, వివిధత్వం, అందం, పురుషులు చూపించలేరు — పురుషుడు ఏడుస్తుంటే ఏడ్చినట్లుంటది — స్త్రీ ఏడుస్తుంటే ఏడ్పులాగే ఉండదు. కాబట్టి ఈ విషయములో స్త్రీ చూపట్టే సామర్ధ్యం ఒకొక్కప్పుడు చూపట్టే సామరస్యం అత్యంతమైన కృషి వల్ల వచ్చినట్లుగా మనం గ్రహించాలి. చూచేరా కృషి ఎంత అవసరమో! ఎంతపనిచేస్తదో!

ఈ కృషికి మహారోదనంయొక్క పర్యాలోకనం చాలా తోడుబడుతది. ఈ రోదన అనే లలితకళని చక్కగా అభ్యసించి ఉపయోగించటంవల్ల ప్రపంచాన్ని ఉన్న అందవికారం కొంత తగ్గుతది. మానవానుభవంలో ఈ "కొంత" ఎంతో

పోతది. ఈ "కొంత" "కొంత" కంటే మరీ ఎక్కువ చేయానికి అవకాశం వ్యవధి మట్టుకు ఏవీ! —

కాబట్టి, అభ్యాసానికి గ్రాహ్యానికి అనుకూలం పోనట్లు కొన్ని ఏడుపు రకాలు చూడాలి.

ఇదిగో చూద్దాం. ఇది ఒక ఏడుపురకం! ప్రవరాఖ్యునిచే తిరస్కరింపబడిన వరూధిని అవమానం, కోపం, కామం భరించలేక వపుస్సౌందర్యంపొంగ, స్తనాల నన్యాపదేశంగా చూపించి అపూర్వంగా ఏడ్చింది. ఆ ఏడుపు ఈ విధంగా శాశ్వతత్వం పొందింది.

"పాటునకింతలోర్తురె కృపారహితాత్మక నీవు క్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోకె గనుంగొనుమంచుబల్కి యా
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటినవిచ్చుగుబ్బ చనుమిట్టల నశ్రులు చిందువందగన్."

ఆహా! ఏమి ఏడుపు! ఈ ఏడుపును ఏనవ్వైనా సమీపిస్తదా! — ఈ ఏడుపుకి ప్రవరాఖ్యుని హృదయం కరుగలేదు. కాని అప్పటినుండి ఇప్పటి వరకు ఉన్న ప్రతి రసిక హృదయం ఆ "కలస్వనం" వలన కరగిపోయి గగుర్పాటు పొందుతున్నదే! — ఈ పద్యానికే కాబోలు ఆముక్తమాల్యదా కర్తయైన శ్రీకృష్ణదేవరాయలు "ఆంధ్రకవితా పితామహ" బిరుదును పెద్దనార్యునికి ఇచ్చేడు!

ఇంకో కవి ఇంకో ఏడ్పును ఈ విధంగా వర్ణించేడు.

" ఈసునబుట్టి డెందమున హెచ్చిన శోకదవానంబులచే
గాసిలియేడ్చె బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయి జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్. "

'పారిజాతాపహరణం' లోని ఈ రుచి నేర్పుగా ఏడ్చే భార్యగల ప్రతిప్రాజ్ఞునికి తెలిసినదేకదా! ఆ కాకలీధ్వని ఆచంద్రార్కం ఉండిపోవలసినదే! —

ఇది చూడండి; వసుచరిత్రకారుడు ఎంత దివ్యంగా ఒక "రాజీవానన" చే ఏడ్పించాడో!

"ఆజాబిల్లి వెలుంగు వెల్లికలడాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటాగ్రం బొత్తి యెత్తి యా
రాజీవానన యేడ్చె గిన్నరవధూరాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబుతోరంబుగన్."

అందుచేతనే కాబోలు నాకు కాంభోజీరాగాలాపనం అంటే అంత ఇష్టం! కాంభోజిలో కరుణపోసింది ఈ ఏడుపే ఐ ఉండాలి. అదేకాకుండా ఆ నాడునుండి వెన్నెలలో చల్లదనం అతిశయించి యుండాలి!

చూచేము కదా ఏడుపు తియ్యదనం, వగరు, చేదు,

పులుపు, కారం, చమత్కారం, వాడి, గంభీరత, మాయ, స్వాభావికత్వం.

ఇంకా ఈ గుణాలేకాక ఎన్నో గుణాలు ఏడుపులో ఉన్నాయి. అవన్నీ విస్తరించటం శక్యాతీతం.

కాని ఈ మరికొన్ని ఉదహారణలు ఈ మహాకళయొక్క వివిధ గుణాలని రుచిచూపిస్తాయి. చవి చూడండి.

ఆకలేసి పిల్ల స్తనపానంకొఅకు ఏడుస్తుంది. భర్తను చావ బాది భార్య ఏడుస్తుంది. ప్రియురాలు గొంతుకు పిసుకుతుంటే ప్రియుడు కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు. ఒకడు చావలేదని వాడి శత్రువు ఏడుస్తుంటే వాడు అకస్మాత్తుగా చచ్చిపోతాడని వాని మిత్రుడు ఏడుస్తున్నాడు. పిల్లచచ్చిపోయిన తల్లి ఏడుస్తుంది. తనకు చావురాదే అని శూల నొప్పితో బాధ పడుచున్న వాడు ఏడుస్తున్నాడు.

ఇంకా భర్తరాలేదని ఏడుపు, ఇంకా భర్తపోలేదని ఏడుపు. నిజానికి ఏడుపు, అబద్ధానికి ఏడుపు. ఉన్నదానికి ఏడుపు, లేనిదానికి ఏడుపు, చావుకి ఏడుపు, బ్రతుకుకి ఏడుపు, (ముఖ్యముగా పురుషుడు స్త్రీనిచూచి ఈభేదాలు గ్రహించాలి.)

నవ్వుమోస్తరే, అనేక విషయాలకి ఇది సిద్ధం. నవ్వు మోస్తరుగానే ఏడుపు సంతోషానికి విచారానికి కూడా!— ఏమి అమోఘమైన విద్య! —

ఓ కాంతా శిరోమణులారా, ఈ విద్యను ముఖ్యంగా మీరు పురుషులకు నేర్పించండి. ఓ పురుషశ్రేష్ఠులారా, నేర్చుకోండి ఈ విద్య స్త్రీలదగ్గర. ప్రపంచ శాంతి స్థాపనానికి ఇది మొదటియత్నం.

వజ్రాన్ని వజ్రంచేతనే ఛేదించాలి. ఆలాగే ఏడుపుని ఏడుపుచేతనే ఖండించాలి.

ఒక్కమాట నాకు మిక్కిలి అందంగా కనిపించే ఏడుపు ఏదో చెప్పొద్దూ ? —

వినండి. అదేమిటంటే — ఒక కంటిలో నవ్వు మెరుగు వెలిగిస్తూ రెండవ దానినుండి కన్నీళ్ళు విడిచే ఏడుపు ! —

చూచేరా, నవ్వు ఏడుపులతత్వం ! చూచినట్లయితే సూచింపబడింది నచ్చినట్లయితే సరైననవ్వు నవ్వుచూ, సరైన ఏడుపుఏడ్చుచు ఈజీవితాన్ని గలగలమనే సెలయేరులాగ ఉత్తేజంతో సంతృప్తిగా ఎందుకు ప్రవహింపజేసి జీవించివేయకూడదూ ?

# 5. దురద.

దురద చాలా గొప్పదని 'లిన్‌యుటాన్గ్' అన్నాడు. నిజంవే! లేకపోతే దురద గోకుకునే మహాభాగ్యం ఎలా కలుగుతది? దురదే లేకపోతే గోకుడుసుఖం మనకు ప్రాప్తించదే!— దురదగోక్కునే సౌఖ్యం లేకపోతే. జీవితం జీవితంకాదు. అదొక వేళ జీవితం అని పిలువబడినా జీవించవలసిన జీవితంకాదు. దురదలేని జీవితం రసంలేని పిప్పి. రంగులోని బొమ్మ పరిమళం లేని పుష్పం హృదయంలేని యంత్రం.

దురద అంటే మనకు గోకాలని ఉద్దేశం గలిగించే శరీరంమీదపుట్టే దురదేకాదు. కావాలనిపించే ప్రతి కోరికకు కారణం ఐనభావం. అంతా దురద. అది శారీరకం, మానసికం—మానసికాన్నే ఆధ్యాత్మికం అని కూడ అంటారు. కాబోలు విద్వాంసులు.

కాబట్టి దురదేలేకపోతే కోరికేలేదు. కోరికలేకపోతే జీవించటం ఏ అనవసరం ఏ కాకుండా అశక్యం కూడాను. జీవించాలని లేకపోతే ఊపిరేతియ్యం.

నిష్కామకర్మ, జీవిత రహస్యం, ఉత్తమ మానవజీవితం అని వేదాంతులంటారు. అది అసత్యం నేను నమ్మను. ఆజీవితం ఉత్తమంకాదు, మానుషం ఏ కాదు; అది జీవితంకూడా కాదు. ఒకవేళ అది అమానుష జీవితం ఐ, దేవతాజీవితమో, రాక్షస

జీవితమో ఐతే కావచ్చు. కాని అది మానవ జీవితంకాదు. మానవజీవితం కానిది నాకర్థంకాదు. నేను మానవుడిని కాబట్టి మానవ జీవితంకానిది నాకు జీవితంలాగ కనుపించదు.

మానవత్వంతోనే మనకు సంబంధం. దైవత్వంతో, రాక్షసత్వంతో మనకెందుకు గొడవ! దేవతలకి, రాక్షసులకి అది విడిచిపెట్టేద్దాం. లేకపోతే మనం వాళ్ళైనప్పుడు అది చూచుకొందాం. మనకున్న గొడవ మనకు చాలు ఇప్పటికి.

మానవజన్మ చాలా గొప్ప జన్మ అంటారు. కావాలనే కోరికని కలిగించే ఈ దురదవల్లే మానవజన్మ గొప్పదైంది. లేకపోతే మృత్యువులాగ స్థావరం ఐఉండేది. కదలిక ఉండేదికాదు. అందులో కదలికే అభివృద్ధికి, దిగజారనానికి ప్రాణం. ఆరోహణం అవరోహణం చలనంమీద ఆధారపడి ఉన్నాయి.

అందుచేత దురదని గర్హించొద్దు. పూజించండి. అదొక గొప్ప వరప్రసాదం; ఆశీర్వచనం. దురద జీవనానికిజీవనం —

కోరికంతా దురద అని ఇదివరకే అనుకొన్నాం— కాబట్టి కోరికఐన ఆకలి దురద. అది ఒక గొప్ప భావం, సంస్థ. అది లేకపోతే ప్రపంచం మారిపోతది. ఆకలిలేకపోతే ఎవ్వరికి భోజనం చేయాలనే ఉండదు. భోజనంలేకపోతే ఎవ్వరూ ఏవిధమైన కృషిచేయ నక్కరలేదు. ధనార్జనకోసం కృషిచేయ నక్కరలేదు. పొలాలుదున్న నక్కరలేదు. ఫలాలనీ వాంఛించం. రుచులతో

సంబంధం ఏ ఉండదు. పానీయంకూడా అనవసరం. దాహం లేనప్పుడు పానీయం ఎందుకు? ఆకలిలేనప్పుడు దాహంవీఉండదు. దాహం ఆకలేకాదూ ? పానీయంకోసం పుట్టిన ఆకలేదాహం !

దివ్యమైన భోజనపదార్థానుభవం, మధుర పానీయ పానానందం ఆకలి దప్పికలు లేకపోతే మానవులకు లభించదే! ఎన్ని ఉంటే ఏం విలాభం, ఆకలిఅనే కోరిక లేనప్పుడు.

ఈ ఆకలిఅనే కోరిక పుట్టించే దురదయొక్క ప్రాశ స్త్యాన్ని, ప్రాముఖ్యాన్ని మారుమోగిస్తూ ఉపనిషత్తుకారులు ఇట్లు అన్నారు. " అన్నవా నన్నాదో భవతి, అన్నంభవతి, అన్నాదోభవతి " ( అన్నంకలవాడు, అన్నం తినేవాడగును అన్నం ప్రాప్తించును ; అన్నంతినగలవా డగును. ) అన్నం తినగలగటానికి ఆవశ్యకంఐంది ఆకలిఅని నొక్కి చెప్పనక్కర లేదు కదా !

ఎడారుల దప్పికలుంటేనేగాని ఎండమావుల వాంఛ కలుగదు. ఎండమావుల వాంఛలేకపోతే చల్లని సెలయేళ్లు ఉన్నాఒకటే ఎండిపోయినాఒకటే ! ఓహో వాంఛాశక్తి ! ఎటు వంటిదీ దురద ప్రభావం.

ఈ దురదే గులాబీపువ్వుని వాసన చూట్టానికి కారణం. పిల్లలిని ముద్దుపెట్టుకోనానికి పునాది. ఇదే ప్రేమ. ఇదేకామం. ఈ దురదలేకపోతే స్త్రీ పురుష సంయోగసౌఖ్యంవ లేదు. అది

లేనప్పుడు సృష్టికార్యంజరుగదు. దురద, సుఖంలేని సృష్టికార్యం ఎవడుచేస్తాడు? అందులో ముఖ్యంగా ఏస్త్రీ అలాంటి సృష్టి కార్యాన్ని మీాద పెట్టుకొంటది!

అప్పుడు సినీమాలేమాతాయో, ఇసుకతిన్నె లేమా తాయో, గడ్డిమేటులేమాతాయో, పడకగదు లేమాతాయో, వెన్నె లేమాతదో!—ముద్దులు పరిరంభా లేమాతాయో!

చూచేరా! ఎంత విపత్తు సంప్రాప్తిస్తందో, ఎంత నిర్జీవం ఐపోతదో జీవనం, దురదలేకపోతే!

అందుచేతనే దురద అత్యంతావశ్యకమైన భావం— మనకేకాదు దాని ఆవశ్యకత. ఈ ప్రపంచం ఎవడైనా సృష్టించి నట్లైతే, ఆ సృష్టికర్తకు కూడాను దురదేలేకపోతే ఎందుకింత గొడవ పెట్టుకొని ఈ సృష్టికార్యం చేస్తాడు ఆ స్రష్ట! ఈ సృష్టి కార్యం లేకపోతే అతనికి ఆధిక్యానికి ఏంవినష్టం వస్తది?— దురదలేకపోతే నేనే ఈలాంటి పనిచేయనుకదా, ఇక సర్వజ్ఞు డైన ఆ దేవుడు ఎందుకు చేస్తాడు?

దేవునికి దురదవేసి గోక్కున్నాడు. ఈ సృష్టి సంభ వించింది. ఈదురదే అతనిలీల. ఇదే జగత్కారణం.

దురదే ప్రతికార్యానికి కారణం అన్నాంకదా! అంచేత ఒకడింత అన్నంపెట్టి వాని ఆకలి తీర్చటానికి కారణం దురదే. మనిషిఆకలితీర్చితే మనకొక విధంవైన ఆనందం కలుగుతది. అది

దురద గోక్కున్నప్పుడు పుట్టిన సుఖం. కాబట్టి అన్నంపెట్టే కార్యాన్ని ఒక మహాదానంలాగ ఒక గొప్పకార్యంలాగ తీసుకో నవసరము లేదు. మన ఆనందంకోసం మనంచేసే పనికూడా గొప్పేనా!

మనం ఆనందంకోసం చదువుకుంటాం, వ్రాస్తాం, పాడతాం, సంగీతంవింటాం, చిత్రాలనిచూస్తాం, వెన్నెల అనుభవిస్తాం. అనేక విషయ సుఖాలని అనుభవిస్తాము. అందులో ఏమాత్రంఐన గొప్పాలేదు. అందులో మంచీలేదు. మంచిలేదు కాబట్టి, చెడ్డది అది అని అనుకోనూ కూడదు! దానిలో అధర్మం ఏమీలేదు. జాగ్రత్తగా చూస్తే, మానవ సౌఖ్యానికి, మానవసంస్థితికి చాలా గొప్ప విషయాలైన, దురద వేయటంలో దురద గోక్కోటంలో, ఏవిధంఐన మంచికాని, చెడ్డ కానిలేదు.—అది సహజంఐన సంఘటన. నీరు క్రిందికి దొర్లటంలో, గాలివీచటంలో, పుట్టుటంలో, చావటంలో ఏవిధంగా మంచీ చెడ్డాలేవో, గోక్కోటంలో కూడా అంతే. అసలు మంచిదీకాదు. చెడ్డదీకాదుదురద దురదే.

అసలు ప్రతీదానిలో మంచీ చెడ్డ నిర్ణయించటం చాలా చెడ్డ అలవాటు. మంచీ చెడ్డలేని జీవ సంఘటనలు సంభవించ కూడదూ?—ఎందుకీ గొడవ! ఉన్నగొడవలు చాలవూ?

దీర్ఘంగా చూస్తే ఈ మంచీ చెడ్డా గొడవలు మనకేగాని దేవుడుకంత ఉన్నట్లుతోచదు. ఈసత్యానికి ఇదిప్పుడే సాక్ష్యం.

---

# 6. ఆటలాడుకోటం.

పిల్లలు గొల్లుమని ఆటలాడుకొంటారు. యువకులు, యౌవనం దాటినవాళ్లుకూడా ఏదోవిధంవైన ఆటలాడు కుం టారు. ఆటలాడుకోటం అంటే మొత్తంమీద అందరకి చాలా ఇష్టం. ఆటలో ఆరుచి ఉంది.

ఆరుచివలననే అనేకంవైన ఆటలువచ్చేయి. పేకాటదగ్గర నుండి, పోలోదాకా, కాలినడకనుండి ఆకాశవిహారందాకా, చిరునవ్వునుండి, ముద్దులనుండి, గుద్దులాటదాకా. వంటివిరు పులుదాకా, ఒకటేఆట!

ఈ ఆటలు ఆడుకోనానికే మనం పుట్టేం! లేకపోతే మనంపుట్టే అవసరంవ నాకు కనిపించదు. మనం పుట్టింది ఒక గొప్పవిషయం అని, ఒక గొప్పకార్యం మనకర్తవ్యం అనీ, జీవించటంఅనేది ఒక బ్రహ్మాండం అంతపని అనీ, నవ్వకుండా ముఖాన్ని ఏవిధంవైన భావప్రకటనలేకుండా (మాపిఠాపురాన్ని ఉన్న "సన్యాసి రాళ్ల లాగ" చాలామంది బోధిస్తారు. వాళ్లనుచూస్తే సకాలున నవ్వువస్తది. ఏం, ప్రపంచం అంతా మన అవకతవకచరిత్రమీదనే ఆధారపడి ఉందా! ఒక మనిషి కాని, కొందరు మనుష్యులుకాని చేసే పనులే ప్రపంచగతికి కారణమా!—ఐతే ఇక దేవుని పెత్తనం ఏంవుంది? —అలాగే ఐతే మనం ఇన్నాళ్లుచేసిన పనులికి సృష్టి అంతా ఈపాటికే

మారిపోయి ఉండవలసిందే! ఏదో కొన్ని యుద్ధాలు మొదలైన వాటివల్ల కొన్నివేలమంది నాశనం ఐపోయినా, ప్రపంచం ఇంకాజనంతో ఉంది; నేలమీద గడ్డి మొలుస్తుంది; చెట్లు పచ్చగా ఉన్నాయి; పువ్వులు పరిమళం ఇస్తున్నాయి; నీరు త్రాగనానికి వీలుగాఉంది; గాలి చల్లగా ఉంది!

ఎవరేదన్నా, మనజీవితం అలాంటి భయంకర జీవితం కాదు. మనం అంత గొప్ప వాళ్లంకాదు. మనం మనుష్యులం. మానవత్వంకలవాళ్లం. మనం ఏంచేసినా విశ్వకల్యాణానికి అట్టే భంగంరాదు. రావణాసురుడంతవాడే కైలాసాన్ని ఎత్తబోతే ఈశ్వరుడు తన బొటన వ్రేలితో కొంచెం కైలాసాన్ని నొక్కితే రావణా బ్రహ్మ "కై" మన్నాడు!

కాబట్టి మనం అట్టే చేయలేవని గ్రహించి, మనమీద ఏవిధంఐన భారంలేదని, భూమితిప్పటం మనపనికాదని మనం హాయిగా ఎందుకు ఆడుకోకూడదూ? బొమ్మపెళ్లిళ్లు చేసుకొంటూ, మట్టిలోపొర్లుచూ, నీళ్లలో తడుస్తూ, గాలిలో ఎగురుచూ, జీళ్లుతింటూ పరుగెత్తుచూ, పడుచూ, లేచుచూ, తోలుబొమ్మలు, పగటి వేషాలుచూస్తూ, ఎందుకు మనం పిల్లలలాగ పకాపకా నవ్వుచూ జీవనయాత్రని పరిశుద్ధమైన ఆటగా చేసి వేయకూడదూ?

అలాచేసేస్తే, ఏవిధంఐన చిక్కూలేదు. తర్కశాస్త్రాలతో వేదాంతాలతో, భూత భవిష్యద్రహస్యాలతో, జగ

తా్కారణాలతో, సంబంధమేం అక్కరలేదు. ఆఖరికి భగవంతుని విషయంఐకూడా అస్తమానం బాధ పడనక్కరలేదు. మన జీవితం బరువుమోయ నవసరం లేకుండా, తేలికగా, సులభంగా చెట్లనీడక్రింద చల్లగా సాగిపోయే పంటకాలువమీద తేలిపోయే పండుటాకులాగ సాగి పోతది.

తేలికలో సుఖం ఉన్నది. సుఖమేకా మనకు ఎప్పుడూ కావలసింది! అది ఒక్కటే వాంఛ. సర్వ జీవి జీవనాలకి సర్వ యత్నాలకి కీలకం, విద్యుచ్ఛక్తి, ప్రాణం, తారకమంత్ర అదే కాదా! ("జాన్‌కూపర్ పౌలిస్" ఏమన్నాడో చూసే ఉంటారు.)

అలాంటి సుఖాన్ని ఇచ్చే తేలిక జీవితం జీవించేస్తూ, ఈజీవిత ఖేలా డోలికలలో ఉయ్యాల లూగేయాలి. ఆలా ఆడుకోలేను, ఆడను అని మూతిబిగించుకొని మూలకూర్చుని గొణుగుకొనే వాడిని, ఆటపాడుచేసేవాడిక్రింద త్రోసిరాజు చేసి ఏమానసిక వైద్యుని పూచీలోనో ఉంచాలి.

ఆటకు కావలసింది ఆడుకోటం. ఆటసాగేలాగ ఆడుకోటం. అలసిపోయినప్పుడు ఆటమానివేసి సుఖంగా నిద్రపోవటం. అంతే, అదే కార్యం. ఇక అన్యం కనుపించదు. చూసేరా ఎంత సులభమైపోయిందో జీవితం!

ఇంకో విషయం. ఈవిధంగా ఆటగా జీవితం ఆడుకొంటే, ఈ లోకంలోని జీవితం ఏ సులభం అవ్వటం కాకుండా,

జనన మరణాలుకూడ గడ్డి పూచల్లాగ తేలిక విషయాలై పోతాయి ! —— ఆ తేలిక భావంతో ఏకీ భవించటంవల్లనే కా బోలు గడ్డి పూచలు ఎప్పుడూ నవ్వుతా గాలిలో తలలూపు తుంటాయి——

మనం సాధారణంగా ఒక జీవితాన్నే ఒక బరువుగా చూడటంకాకుండా, అల్లా చూడ్డంవల్లనే కానివ్వండి, చావు బ్రతుకులనుకూడా గొప్ప బరువు క్రింద గొప్పవిషయాలక్రింద చూస్తుంటాము. "జీర్ణాని వాసాంసి యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి" అని మహోత్సాహంగా ఎత్తుకుని గీతా వాక్యం ప్రాతబట్టలువిప్పి క్రొత్తవి కట్టుకొనునట్టిది జీర్ణశరీరాల విడిచి నవ్యమైనవానిని ధరించటం అని ఏక ఘోషగచాటిస్తూ, చావు బ్రతుకుల గడ్డి పూచ తత్త్వాన్ని, తేలిక సుఖాన్ని ప్రకటిస్తుంటే మనం చెవిని ఒగ్గకుండా మనం పట్టిన కుందేటికి మూడేకాళ్ళని మునుగతన్ని పడుకుంటాం. మునుగు తీయం. మొండిపట్టులో మనం ఆరితేరాం.

ఆపట్టు బ్రద్దలు కొట్టాలి. చావు బ్రతుకులు, నవ్వటం, ఏడ్వటం, తినటం, ముద్దు పెట్టుకోవటం, కరవటం, గిలిగింతలు పెట్టుకోవటం, నిద్రపోవటం, చూడటం, గోక్కోవటం, తుమ్మటంలాటి అర్థంలేని సహజంబైన సంఘటనాలని, తేలిక విషయాలని, ఆటలో ఒక పాలు అని గ్రహించాలి. చెడుగుడు

ఆటలో గుక్క పట్టించినవాత గుక్క విడవటం ఎలాంటిదో జీవితంలో బ్రతుకుతూ చావటం అలాంటిదే అంతా ఆట.

ఈశ్వరుడే ఈసృష్టిలో ఆడుకుంటున్నాడని చాలామంది చెప్తూంటారు కదా నాకు ఇది నచ్చింది. లేకపోతే ఎందు కతని కీగోడవ!—అతడే ఆడమంటున్నప్పుడు మనం ఎందుకు ఆడుకో కూడదు. అతనికే ఇలా ఆడుకోటం ఇష్టం ఐనప్పుడు మనల్ని కూడా హాయిగా ఆడుకోమనే అతడు మనలిని పుట్టించేడని నాకు శుభ్రమైన నమ్మకం; ఒక వేళ అతడే మనల్ని పుట్టించి నాడంటే.

ఆటగా, ఆటకోసం ఏ ఈలాపుట్టింపబడ్డ మనం ఆడు కోటం సహజం, అలా చేయుటం మనం సృష్టితో అనుకూలత్వం, సామరస్యం పొందటం — ఒక వేళ ప్రతివిషయంలో దేవునికి మనకు సంబంధం కల్పించు కోవాలంటే ఆడుకోవటమే దేవుని నిర్ణయాన్ని అనుసరించటం, అతనికి సంతృప్తినిచ్చి అతనిని మంచి చేసుకోవటం.

ఈ విధంగా ఆడుతూఉండే మనకు మన జీవితంఅంతా ఆటగా, అవుతుంటే జీవితంలోనే ప్రతివిషయం ఆ ఆటలోని ఒక సంఘటనగానో, అధ్యాయంగానో వికసిస్తది.

పసిపిల్లవై స్తన్యపానం చేయుటం, అల్లరి పిల్లలై గంతు లేస్తూ గోలచేయటం, బడిపిల్లలై బడికివెళ్లుతూ వీలైనప్పుడల్లా చదువు ఎగగొట్టుతూ పుస్తకాలకి యిచ్చిన డబ్బు బిళ్ళలకు విని

యోగించటం, కళాశాలలో మొదటి సంవత్సరం పురుషులైతే స్త్రీలవైపు, స్త్రీలైతే పురుషులవైపు చూడటం, ఇంకా కొన్నాళ్లకు ప్రేమతో, ముద్దులతో పరిరంభాలతో సంభోగాలతో కాలం గడుపుతూండటం, తరువాత వివాహం మొదలైనవి చేసుకొని పిల్లలిని జల్లలిని పుట్టించి వేయటం, వాళ్లని పెంచటం తాము ఉద్యోగాదులు చేయటం, మంచిబట్టలు వేసుకోటం, ధనం ఆర్జించటం, వ్యయంచేయటం, ఊహించటం, ఆశించటం, ఎగరటం, పడటం, వీలైనప్పుడు, ఇక వీలుగానప్పుడు కొంచం అబద్ధాలు చెప్పటం స్వార్థం పరమార్థం చేయటం, అప్పుడప్పుడు దానం చేయటం, (పేరుకోసం ఐతేనేమి, బిరుదులకోసం ఐతేనేం, నలుగురిలో గొప్పగా తిరగటానికైతేనేం, ఆ ముష్మికం కోసం ఐతేనేం, దానంవల్ల వచ్చే తృప్తికోసం ఐతేనేం, చేయటం కోసం ఐతేనేం, దేనికోసం ఐతేనేం!) గిలిగింతలు పెట్టటం, తన్నుకోటం, నవ్వటం, ఏడ్వటం, అనేక కార్యాలుచేయటం, చదవటం, వ్రాయటం, మేలుకోవటం, నిద్రపోవటం, కలగంటం, పగటివేషాలు వేయటం, త్రాగటం, తినటం, నల్లమందు వేసి కోవటం, అన్నీ ఆటలోని సంఘటనాలు; ఆటలోని ఆటలు.

ఈ జీవితఖేలలో భయంకరాలైన ఆంక్షలకు, నిబంధనాలకు ఆస్కారం అవసరంలేదు. కాని కావలసిందేమి టంటే ఇదివరకే సూచింపబడ్డట్టుగా ఆటసాగించటం. కాబట్టి మనంచేసుకొనే ఆట నియమాలు ఆట సాగిపోవటానికి అనుకూలంగా

మాత్రం ఏఉండాలి. అంతేకాని అవి ఆటనే చంపేస్తే ఏలా? ఆటకొఱకే నియమాలు కాని, నియమాలకోసం ఆట కాదుకదా!

మనం ఈ విషయాలను గుర్తించి ఈ జీవితంతో (పై జీవితంమాట ఇప్పుడెందుకు లెండి) తేలికగా సాధ్యమైనంత సుఖంగా ఆడుకుందాం. అలా ఆడుకునేటప్పుడు అనవసరాలైన భయాలు భస్మం ఐపోతాయి; అసత్యాలైన బరువులు బ్రద్దలైపోతాయి, అవకతవక బాధలు అంతరిస్తాయి.

అదేకాకుండా ఈ జీవితంపై ఆటపై వినియోగించవలసినంత ఆసక్తినీ వినియోగిస్తూ ఆటమానివేసినంత మాత్రాన్ని ప్రళయంరాదనే ఆటలోని భావాన్ని, గ్రహిస్తూ, అన్నీ ఆటలోని విషయాలే అనే దృగ్జ్యోతిని, ప్రసరింపజేస్తూ చిరునవ్వు వేదాంతంతో ఆటలో జీవించ వలసినంత కాలం జీవించేస్తే, జీవితానికే ఒక అపూర్వకళ, ఒక అవ్యక్త మధురమైన రాగాలాపన కలుగుతాయి.

ఆకళ, ఆ ఆలాపన అనుభవైకవేద్యాలు. ప్రతివ్యక్తికీ ఆ అనుభవజ్యోత్స్నలో సుస్నాతులయ్యే హక్కు ఉన్నదని ఢంకా మీద కొట్టి చెప్పవచ్చు.

# 7. దేవుడు

దేవుడనేది ఒక గొప్ప సత్యంఐనా కావాలి లేకపోతే ఒక గొప్ప అసత్యంఐనా కావాలి. ఎందుచేతనంటే దేవుడిని గుణాల విషయమై అభిప్రాయభేదం ఉన్నా, ఉన్నాడా లేడా అనే విషయంలో ఉండటంటే, లేక ఉండపోవటంటే కాని రెండిటికి మధ్యగా ఏవిధంఐన రాజీకుదరటం అంత తేలిక పనికాదు. ఒకప్పుడున్నాడు కాని ఇప్పుడులేడు అంటాం, ఇది వరకు లేడు ఇప్పుడున్నాడు అంటాం, ఇప్పుడు అప్పుడులేడు ఇకముందు ఉంటాడు అంటాం, ఇదివరకు ఇప్పుడూ ఉన్నాడు ఇక ముందు ఉండడు అంటాం, పూర్వంఉన్నాడు ఇప్పుడులేడు ముందు ఉంటాడు అంటాం, . ఎప్పుడూలేడు ఇప్పుడే ఉన్నాడు అంటాం, అంతేకాని ఉన్నాడాలేడా అనేదానికి మధ్యస్థంగా రాజీచేయటం కాదు. కాల విషయకమైన వివాదం — దేవుడు ఉన్నాడా లేడా అనే దివ్య వర్తమానార్థకంఐన ప్రశ్నకు ప్రత్యుత్తరం "ఉన్నాడు" లేక "లేడు" అనే నిష్కర్షమైన పదం. కాని ఆ ప్రత్యుత్తరం ఎవ్వరు ఇవ్వనర్హులో అనేది వేరే సంగతి.

మనకు దేవునికి ఒక గొప్ప సంబంధం కలిపించేరు. ఈ సంబంధాన్ని ఆధారం చేసుకొని ఉత్తమోత్తమంఐన కార్యాల దగ్గరనుంచి అధమాధమమైన కార్యాలదాక దేవుడనే వ్యాజం మీద చేస్తున్నాం మానవులం. కాబట్టి దేవుడనే తత్వాన్ని గురించి, ఉన్నాడాలేడా అనే విషయాన్ని గురించి, అతనికి

మనకి ఉన్న సంబంధం గురించి, మనకర్తవ్యం గురించి, కొంచం చూసుకొంటే ఆక్ష్టేకాలం వృధాచేసిన వాళ్లంకాము. (నిజంగా చూస్తే వృధాచేయక చేసేదిమాత్రం ఏం(వుందీ!) అలా చూడటం వల్ల మనకు తృప్తి కలుగుతది కొంత. కొంతవాట్టుకు కొన్ని విషయాల విషయమై ఈ విధంగా నడుచుకొంటే మనకు కొంత హాయిగా ఉంటదనే భావం కలుగజేస్తది. అంతాకన్నా కావల సిందే(వుంది? మనకు ఎంతసేపూ "కొంతే, కొంతే!" అంతా మనకు అసాధ్యం. కాని ఆకొంతే మనకు కొండంత!

మనకెప్పుడూ కొంతే అంత! మానవులు విశ్వంలో చెదపురుగుకంటే చిన్నవస్తువులైనా, ఎంతోవాళ్లగ, 'అంత' గ వాళ్లకే కనిపిస్తారు!

ఇక మూల విషయం ఎత్తుకొందాం. కాని ఆవిషయం గూర్చి ఆలోచిస్తన్నప్పుడు కొన్ని విషయాలు గుర్తించాలి: మనకు కంటికి ప్రత్యక్షంగా కనుపించే విషయాల విషయమే మనకు సంపూర్తిగా తెలిసికోవటం కష్టం ఐనప్పుడు, కంటికి, మనసుకీకూడ అతీతంఐన ఈ దేవుడనే విషయాన్ని సరిగ్గా గ్రహించటం అంతసులభంకాదనీ, కొంత గ్రహించినా అంతా గ్రహించటం చాలవరకు అసంభవం అనీ, ఏవిధంగా ఎంత గ్రహించినా ఆగ్రహణ, వ్యక్తినిబట్టి మారతదనీ, అనేక వ్యక్తు లున్నాయని, ఆవ్యక్తులలో ఈ రచయితకూడా ఒక వ్యక్తియని, వేదవాక్కే వేదవాక్కుగా పరిగణింపబడిన ఈ దినాలలో

ఏ ఒకవ్యక్తియొక్క ఉక్తి (ఇలాంటి విషయాలలో ముఖ్యంగా) 'వేదోక్తి' కాదని ప్రస్తుత రచయితయొక్క మాటలు, వ్రాతలు ఊహాప్రకటనలు కూడ 'వేదోక్తులు' కావని, కాని తనవంటి ఆశయాలు, అనుభవం కలవాళ్లు భర్తృహరి చెప్పి నట్లు ఎక్కడైనాఉంటే వాళ్లతో హృదయ సంభాషణచేసే సరదా కలుగవచ్చుననే ఉద్దేశంతో ఈ రచయిత ఈ విషయం చర్చిస్తున్నాడనీ గ్రహించాలి.

ఇక కథా మూలం — దేవుడు — అతడుఉన్నాడా లేడా అనే చర్చ. దానిలో ఒక చిన్న గమ్మత్తుఉన్నది. అదేమిటంటే దేవుణ్ణి మనం మనకోసం ఉంచుదాం, తీసి వేద్దాంవా అనే ఆలోచన. (ఎంత చిన్ని పురుగికి ఎంత పెద్ద ఆలోచనో !!) ఎంచేతనంటే మనకొద్ది శక్తి మనకు తెలు సును. చూపు కొంతదూరం మాత్రంవే ప్రసరిస్తది, కాని ఆపైని దానికి అశక్యం. అనుభవంకూడా ఆత్మగ్రాహ్యం అయిన కాలావకాశ సంఘటనా నిబద్ధితమై సంపూర్ణ స్వేఛ్ఛా వైశాల్యంలేనిది. (ఆత్మ అంటే మనమే. మనం ఎంతో అది అంతే. ఆత్మఅంటే మన అనుభవాల ప్రోగే కాని ఇక ఏమీకాదంటారు కొందరు!) అలాంటప్పుడు కాలాతీతమై, చక్షుర్మానసాగోచరమై, అవేద్యమై, మహోన్నతమై, ఒక మహాకారణమై, దివ్యకర్తయై, అనంతమై, సర్వశక్తియై, అపూ ర్వపదార్థమై వెలుగొందు ఒకతత్వాన్ని గురించి మనంసంభాషించ

నానికి సాహసించేవంటే, అది ఒక మొండితోపు, గుడ్డివినురు అంతతో ఆగక, ఆ దివ్యపదార్థం ఇదమిత్థం అని నిర్వచనం చేయటం, అటువంటిది 'ఉన్నది' 'లేదు' అని నిర్ణయించటం, పునాదిలేని గాలిమేడ కట్టటం. మన అనుకూలంకోసం చేసే మిథ్యాకార్యం. కాబట్టే 'మనకోసం ఉంచుదామా, తీసివేద్దామా అనే ఆలోచన' అని వాదం.

నిజంగా భగవంతుడున్నాడో లేడో తెలియదు. నేను ఆస్తికుడనని చెప్పే జ్ఞానం కాని నాస్తికుడనని వక్కాణించేశక్తి కాని మనకు లేదు. భగవంతు డుండేవాడైతే మనం ఏమనుకున్నా ఉంటాడు. లేనివాడైతే ఏమనుకున్నా ఉండడు — ఆస్తికులు ఆ తత్వాన్ని పుట్టించలేరు. నాస్తికులుదాన్ని నాశనం చేయలేరు — మన ఊహాలతో దానికి సంబంధం లేదు. మనచేష్టలు దానిని తాకవు. (ఇదంతానాఊహ, లేక నా అనుమానం అని మళ్ళీ నొక్కి చెప్పాలా!) లేకపోయినట్లయితే ఈ పాటికి (భూమిపుట్టి దానిమీాద మనుష్యుడు పుట్టి ఎన్నాళ్లైందో సరిగా జ్ఞాపకం లేదు.) భగవంతుడు ఊసరవెల్లిలాగున ఎన్నో రంగులుమారి ఉండవలసిందే. [దశావతారాలతో విడిచిపెట్టేనేరు దేవుణ్ణి కొందరు. అణువు దగ్గరనుంచి ఆకాశందాకా ఉన్న అన్నీ అతనే అన్నారు మరికొందరు. (అబ్బా, రాయిరప్పా, పాము, బురద, గాడిద, కాకి, నేనే అవ్వటం నాకే ఇష్టంలేదు!) మూర్తిత్రయం "ట్రినిటీ" అన్నారు ఇకకొం

దరు. చెడ్డ, మంచీ అని ద్వైతం ఇచ్చి కొందరూరుకొన్నారు. అంతా ఒకటే అని అద్వైతాన్ని తగిలించేరు మరికొందరు బుద్ధిమంతులు. ఏవీలేనిదే, అతనని అతనికి బరువులేకుండా చేసేరు మరీ సున్నితమైన వారు కొందరు – కాని అసలు దేవుడు నిజంగా మారినట్లు దృష్టాంతరాలు ఇంకాలేవు! ]

కాని ఈ బుడబుక్కల వేషాలతో సంబంధం లేదు, దానికి. అది ఆమహా ఉద్దేశండుంటే ఉంటది. లేకపోతే ఉండదు. ఇదే మహాసత్యం, నా తారకమంత్రం నా వేదం— 'ఆస్తి' 'నాస్తి' అనే వాని మూలసత్యం అగోచరం. (అసలు ఏవిటో తెలియదని 'కాన్టు' అన్నాడు. మనకు సంబంధించిందే అని 'హెగల్' అన్నాడు.) కావలసింది భగవంతుడు మనకు కావాలా వద్దా అనే విషయం. అంటే భగవంతుణ్ణి మనకోసం ఉంచావా, తీసివేద్దాంవా అనేవిచారణ. (అసలు నిజంఎట్లున్నా, ఆ అసలు నిజం తెలియనప్పుడు మనకోసం, మన ఆనందంకోసం మనం ఇక్కడ కొన్నివిషయాలని సృష్టించుకోటం, వానిని మూలానికి విరుద్ధం కానప్పుడు నమ్మటం, అవ్యక్తమైన పని కాదు కదా! ఏమీదానిలో సత్యానికితావున్నది, కాదూ! సత్యమే అంత అవసరమైతే !)

భగవంతుణ్ణి ఉంచటమా తీసివేయుటమా అనేవిచారణలోనున్న ప్రశ్నకు అందరికి వర్తించేటటువంటి ఏ ఒక్క జవాబులేదు. ఎవరికివారు వారికి తోచిన విధంగా వారికి అను

కూలంగా వారి శాంతి కోసం, వారిసౌఖ్యంకోసం, స్వంత జవాబులిచ్చుకోవాలి. అదే సరియైన ప్రత్యుత్తరం. సత్యంఐన విశ్వమతం. ప్రత్యుత్తరములోనే నిమిడిఉన్నాయి ఎంతవరకు ఆజీవికి, ఆ తత్వానికి, సంబంధం అనే విషయం ఆ సంబంధం ఎటువంటిదో అనే విషయం ఆ సంబధాన్నిబట్టి ఆజీవికార్యం ఏవిధం ఓ అనే విషయంకూడా.

ఆ దృక్పథం నీడలో (లేక వెలుగులో అననా?) నే నొక జవాబు చెప్పుకుంటా.

నాయొక్క అనుభవం ప్రకారం (నాఅనుభవం మీకు తెలియదు బహుశా; నేను చెప్పదల్చుకోలేదు కూడానూ. ఎంచేతంటే అలాంటి అనుభవం అనుభవ నీయమే. విప్పి చెప్ప నశక్యం.)—నాకు భగవంతుడు ఉండాలి. కాబట్టి ఆతత్వాన్ని నేను సృష్టించుకుంటా. అసలు ఏమైనా, లేదని నిర్ధారణ కాలేదు కాబట్టి ఆతత్వం ఉన్నదని అనుకుంటా, నమ్ముకుంటా. లేకపోతే నాకు శాంతిలేదు. సౌఖ్యంలేదు. అలాఉన్నదను కోటం సాధారణ నమ్మకం. ఒకొక్కప్పుడు దేవుడనే తత్వంఏ లేదను కొన్నా - కాని అది సాధారణం కాని కొన్నికొన్ని సమయాలలోవచ్చిన భావం.

ఈ దేవుడున్నాడనే భావం నాకు చాలా ముఖ్యం. ఒక విధంఐన అపరిమితంఐన ఆకలిని అది తీరుస్తది. ఇంక మరి ఏభావం దానిని తీర్చలేదు. ఆకలికి అన్నం ఉన్నట్టు

దాహానికి నీళ్లు ఉన్నట్టు, అలయికకి నిద్ర ఉన్నట్టు, నాజీవిత పంథలోని ఎంతో కావాలనే వాంఛకు ఈసర్వశక్తియైన కరుణా మయుమైన దేవుడనే ఈ అపూర్వతత్వం ఉన్నది.

వాంఛలేని వాడనుకాను. వాంఛించటం నా మానవత్వం. అలాంటప్పుడు నా ఆ ముఖ్యవాంఛకు ఆదేవుడున్నాడనే భావంకాక మరి ఏది తృప్తి ఇస్తది ? అందరాని పండు కోయాలన్నప్పుడు (అంటే పండువిషయమై భగవంతుణ్ణి ఆట్టేబాధ పెట్టను!) ఎగిరి క్రిందపడ్డప్పుడు, ఇక ఎవ్వడు ఏవిధంఐన సహాయంచేయలేనప్పుడు, నేను కదలలేనప్పుడు, నాకు కావలసింది పోయినప్పుడు. నాకు ఎంతో అవసరంఐంది వచ్చినప్పుడు, మహావిచారం వచ్చినప్పుడు, మహా సౌఖ్యం కలిగినప్పుడు, నాకు సర్వజ్ఞమైన, కరుణామయుమైన ఒక సర్వశక్తి నామనో భావాలు చెప్పుకోటానికి కావలసి ఉంటది. ఆతత్వభావ సామీప్యమే నాకొక సౌఖ్యం కలుగచేస్తది. అదేదో నాకు సహాయం చేయవచ్చుననే ఆశకూడా నాకొక తళుకు ఇస్తది.

నాకు నాకాళ్లమీద నుంచోటం ఇష్టం. చేతకాని వాడిలాగ అస్తమానూ మొర్రోయని మొరపెట్టటం ఇష్టంలేదు. నాలోనేనే ఏడ్చి నాలోనేనే నవ్వుకుంటే నాకు ఔన్నత్యం కలుగుతదని నాకు తెలుసును, రెండు దెబ్బలుతిన్నా, రెండు దెబ్బలు యిచ్చో యియ్యకో జీవితం గడపాలని నాకు తెలుసును. "వెల్సు" అన్నట్లు ధైర్యంతో జంకకుండా ఒక విధ

మైన మొండితనంకూడా చూపిస్తూ నిలుచున్న వాళ్ళంటే భగవంతుడికి కూడా ఇష్టంగా ఉండి ఉండాలనికూడా ఊహిస్తాను. సృష్టి సాగిపోవటంలో ఉండేవాళ్ళు ఉంటారు అనీ, నశించేవాళ్ళు నశిస్తారు అనీ, నవ్వేవాళ్ళు నవ్వుతారు అనీ, ఏడ్చేవాళ్ళు ఏడుస్తారు అనీ, సృష్టిఅంతకు ముఖ్యం ఐనవాడు ఈ విశ్వంలో కోటివంతైనాకాని చిన్నమానవుడు అని అనుకోటం అహంభావం అనీ, ఈలోకమే స్వర్గలోకంగా చేయటం అసంభవం కాని శాశ్వతత్వంయే మన జన్మహక్కు అని అనుకోటం సరియైన పద్ధతి కాదనీ, నాకు బాగా తెలుసును. అంచేతనే భగవంతుణ్ణి ఏవిధం ఐన బాధలోకి దింపక, అతనిని ప్రార్థనలతోనైనా విసిగించక అతనిని నాకిది కావాలి నాకది కావాలి, నాభార్య ఎల్లప్పుడు సువాసినిగాఉండాలి, నాకొడుకులు గొప్ప ఉద్యోగులవ్వాలి, నాపొలాలకి వర్షంకావాలి (మిగతా వాళ్ళపొలాలు మునిగిపోయినా అంతపరవాలేదు!) నాసుఖానికి అడ్డంరానంత సేపు సగ్వజనులుకూడా సుఖంగా ఉండొచ్చునని నాకిక్కడ ఎప్పటికీ సౌఖ్యంకలుగాలనీ "దేవుడా నీవు మిగతా పనులన్నీ మైనా మానుకొని నాపనే చూస్తూ నాపాలికావులాగ ఉండాలి, లేకపోతే జాగ్రత్త, నీకు మ్రొక్కులు, పొగడ్తలు, లంచాలివ్వను, ప్రార్థనచెయ్యను, నీవు క్రూరుడవంటాను, నీవులేవే అని శాసించేస్తాను," అనిపైపెచ్చు బెదిరిస్తూ, దేవుణ్ణి వేపుకొని తినక, అతనిగొడవే యెత్తుకోక ఊరుకొని చేసేది లేదని, కదలికలో హాయి ఉన్నదని, కొంచం

సేపు కదలికలో, మరికొంతసేపు నిద్రలో కాలంగడుపుతూ {మంచి అంటే మనసుకుమంచి అని తోచిందే—(అంతకన్నా సరియైనసాక్షి ఇక ఏదీ కనుపించదు. ఒకవేళ ఈ మనసు సరియైనసాక్షి కాదన్నా.)} తాము సుఖిస్తూ నలుగురిని సుఖపెడుతూ కాలం జరపటం వాంఛనీయమని, పని అని, అలా చేసేవాళ్లు గొప్పవాళ్లనీ నేను తలుస్తాను.

కాని ఎంతమందికి ఆశక్తి ఉన్నదీ!—ఒకవేళ ఎంతమందికి అది ఉన్నా, నాకుమాత్రం అలా ఎప్పుడూ ఉండదు. పుట్టకుండా, చావకుండా ఉండేశక్తి ఎలాలేదో అలాగే దేవునితో ఎప్పుడు ఏవిధంఐనా, సంబంధం కల్పించుకోకుండా ఉండేశక్తి నాకులేదు. కొంతసేపే ఏధైర్యంఅన్నా, కొంతసేపే ఏమహాత్మ్యంఐనా, ఏప్రగల్భమైనా, ఏశక్తిఐనా, ఆపైనభగవంతుడనే తత్వం కావాలి. లేకపోతే జీవించటందుర్భరం. ఆత్మహత్య చేసుకోవలసిందే (కాని ఆత్మహత్య చేసుకుంటే మట్టుకు శాంతి సౌఖ్యం కలుగుతాయా! ఏమో, ఎమో!—)

అర్థం కాని అన్నిటికీ దేవుడనే ఊహ అర్థం. ఆ ఊహని అంటే అతనిని అనవసరంగా బాధ పెట్టకుండా నాతో అతనికి సంబంధంలేకపోయినా, అతనితో సంబంధం పెట్టుకొని తప్పని సరియైనప్పుడు అతనిని నాకు సహాయం చేయమనికోరుతూ, నామొర్ర అతనువినినా వినకపోయినా, అతనిగుణాలు నాకు తెలియకపోయినా, అతడు అసలుగాఉన్నా

లేకపోయినా, నాకు తోచిన విధంగా అతనిని ఊహించుకొంటూ ప్రార్థించుకొంటూ ఉన్నాడనే ఉద్దేశాన్ని, నదిలో మునిగి పోతూన్నవాడు [illegible] పట్టుకొన్నట్లు పట్టుకొని కాలంజరిపి వేయటం నాపంథ.

అసలు సత్యాసత్యాలు, ఇదివరకే [illegible] నాసొమ్ముకావని గ్రహించి, దేవుడున్నాడని నిర్ధారణ చేసుకున్నా! — "అజ్ఞానీ!" అని ఎవరైనా అంటే "జ్ఞానీ! నాకలలో నన్ను సుఖించనీయవోయీ!" అని అంటా.



# 8. ప్రకృతి

తమ అహంభావంలోనో, తమ అల్పత్వంలోనో, తమ ఆధిక్యంలోనో తమ అజ్ఞానంలోనో మానవులు అనేక విషయాల్ని ఊహించుకుంటారు, అనేక రూపాలని సృష్టించుకుంటారు. దానిని ఊహాశక్తి అనవచ్చు, జ్ఞానోదయం అనవచ్చు, కలలో కలవరింత అనవచ్చు, ఉన్మాదం అనవచ్చు — సాధారణంగా దానికి సత్యంతో అంత ఎక్కువ సంబంధం అవసరంలేదు! —

ఏమి ఊహించి, ఏఁవన్నా జరిగిపోతంది. ఊహా కార్యం సృష్టికార్యం. మానవులు స్రష్టలై సృష్టియైన ఇంకొక ఏవ్యక్తీ ఉండే ఆవశ్యకతని చాలమట్టుకు తగ్గించేసేరు. (సృష్టికర్తే ఎవడైనా ఉన్నట్లయితే, ఇంత సహాయంచేసి ఎంతో బరువు తీసేసినందుకు మానవులకు ధన్యవాదాలు తప్పక అర్పించి ఎక్కడో ఒకచోట ఒక రాతీ మానవ విగ్రహాన్ని పారవేసి ఒక చిన్ని ఆలయం, "మానవాలయం" కట్టించేయవలసిందే!)

ఆ ఫలితం భూనభోంతరాళాన్ని అంతా ఆక్రమించి ఉన్నది. అదే అపరసృష్టి, (త్రిశంకస్వర్గం అదేనా!) మానవ సృష్టి. అందులోనిదే ప్రకృతి, మనం ప్రకృతి అనుకొనేది.

నిజంగా మనతీక్షణ బుద్ధిప్రకారం {అంటే మనకుఉన్న బుద్ధి అనే దీపం ప్రకారం (మనకున్నా దీపం దొంగదీపంఐనా,

మేజిక్ లాంతరుఐనా, దీపంవేకాకపోయినా, మనకు దానికన్నా వేరేదీపం, ప్రమాణంలేదు కాబట్టి ఆ మనకున్న దానినే దీపంగా ప్రమాణంగా తీసి కోకపోతే ఇదమిద్ధం అని గురికి బారెడు హెచ్చు తగ్గుగా మన ఉపయోగంకోసం మనవాహ్యాళి కోసం ఒక ఊహైనా విరసనానికి వీల్లేదుకదా!) ఈ ప్రకృతిని చూస్తే, సత్యం అనే మృగతృష్ణని విడిచిపెట్ట లేకపోతే, ఈ ప్రకృతి పెద్ద బొంకుఅని తోచకమానదు. ఈ ప్రకృతికి మానవమనోగత సర్వ శక్తిమైన భగవంతునికి కొంచం (కొంచంమాత్రంవేం!) తక్కువగా, మాయతో, సమానంగా (భగవంతుడు, మాయ, ప్రకృతి అని మూడింటిని కలిపినందుకు వేరేగా తలపవలసిన అవసరంలేదు!) ఉన్నత స్థానాన్నిఇచ్చినా, మనం జాగ్రత్తగా తీక్షణంగాచూస్తే దాని అసత్య స్థితి భళ్లున పట్ట పగలు కొతది.}

చూడండీ, ప్రకృతియొక్క నిర్వచనం. కొండలు, మేఘాలు, ఆకాశం (అంటే ఏంవీలేనిది — చూచేరా గాలి ఎలా వీస్తుందో!) గడ్డి, చెట్లు, పువ్వులు, ముళ్లు, సముద్రాలు, నదులు, ఎడారులు, మెరుపులు, ఉరుములు, ఇంద్ర ధనుస్సులు, పిడుగులు, వర్షం, వడగళ్లు, జలపాతాలు, భూకంపాలు, అగ్ని, పర్వతోద్భూతమైన వేడి, హిమవంతోద్భూతమైనచలి, సూర్య చంద్రులు, నక్షత్రాలు, తారాపథం, చీకటివెలుగులు, గాలి, పరిమళం, ఫలాలు, రసం, భ్రమరాలు, పిట్టలు, శబ్దాలు,

మృగాలు, బహుళా విరహం మొదలైన భావాలు కలిగిన స్త్రీ పురుషులు కలిసిన ఒక మొత్తం. ఐతే అవన్నీ తీసివేస్తే వేరే వేరేగా, మొత్తంఅనేదే లేదు—అంటే ప్రకృతేలేదు. మొత్తం అనేది అన్యరూపం ( అంటే మొత్తంలో ఉన్న వాని రూపంకంటే అన్యం — ) ఆ అన్యరూపం దాల్చలేనప్పుడు ఆ మొత్తం మిథ్యయైన ఒక మన ఊహానిర్మితం కలసి, ఉన్నంతమాత్రాన వస్తు సముదాయానికి అంటే మొత్తానికి ప్రత్యేకత రాదు. అన్యరూపం వస్తే కాని దాని ప్రత్యేకత ఏర్పడదు. కొండలు మొదలైనవి రాళ్లు మట్టి చెట్లు మొదలైనవాని సమూహంఐనా రాళ్లకి మట్టికి చెట్లకి అతీతంఐన ఒక క్రొత్త రూపాన్ని దాల్చి ప్రత్యేక సత్యాన్ని నిలవబెట్టుకొన్నాయి — ఏదీ ప్రకృతికి అటువంటి ప్రత్యేకత? ఒక చిత్రానికున్నా ప్రత్యేకత ఐనా లేదు. చిత్రానికి ఒకగుడ్డో, కాగితమో, చుట్టూ ఒక చట్రం లాంటిదో ఉంటుంది — దీనికేదీ !

ప్రకృతికి ప్రకృతిలో ఉన్న వస్తుసముదాయం యొక్క వివిధ ప్రత్యేకతకంటె వేరైన ప్రత్యేకతలేదు. కాబట్టి ఈ ప్రకృతి మొత్తానికి ప్రత్యేకస్థానంలేదు. ప్రత్యేకస్థానంలేని మొత్తంనాస్తి. అసత్యం. అంచేత ప్రకృతి అని మనం అనుకొనేది ఒక అసత్యం, అసత్యభావం—కొండలు, నదులు, నక్షత్రాలు మొదలైనవి వాటికన్నిటికి ప్రకృతి అని పేరు పెట్టటం—జనాభా అన్నట్లు అంటే ఒప్పుకోవచ్చు. కాని ఆ ప్రకృతికి ప్రత్యేకత ఉన్నదంటే ఒప్పుకోవద్దు. ఈ ప్రకృతి అను

కొనే మొత్తానికి ప్రత్యేకస్థానంలేదు. అంచేత ప్రకృతి అనేది ఏమీ లేదు. (ఊహామిథ్యలో తప్ప!). ఉన్నవి, వేరువేరైన కొండలు, నదులు, నక్షత్రాలు మొదలైనవి.

ఐతే ప్రకృతి ప్రత్యేకతనుగూర్చిన గ్రంథాలు ఏం వౌతాయి అని అనుకొంటారేమో! సందేహింపద్దు. చింపివేసిన కాగితాలు పారవేసే బుట్ట ఉన్నది కాదూ! పోనీ ఆ శ్రమమాత్రం ఎందుకూ? ఎవ్వరూ ఎప్పుడూ చూడని గ్రంథాలయాలలో పుస్తకాల బీరువాలఅరలు ఉన్నాయి కాదూ?

కాని ఉంకో సందేహం పుట్టొచ్చు. ప్రకృతి అనేది వేరే లేకపోతే అసలు "ప్రకృతికాంతా" అని పాడుకునేవాళ్ళమాట ఏమిటనీ. అది అనవసరం. వాళ్ళపాటవాళ్ళకే ఆనందం. పిచ్చి వాళ్ళ ఆనందాన్ని మనంపాడుచేయుటం ఎందుకు? వాళ్ళకర్మ వాళ్ళది; మనది మనది. ఉంకోమాట, లేనివి ఉన్నట్లుగా చూసేవాళ్ళ శరణ్యం పిచ్చాసుపత్రి.

అదేకాకుండా కొన్ని కొన్ని అత్యంతావస్యకాల వల్ల దృష్టిభ్రమ, మనోభ్రమ కలుగుతుంటాయి. చార్లీచాప్లిను "గోల్డురష్" లో క్షుద్బాధా బాధితుడైన ఒక మనిషికి కోడి లాగ కనిపిస్తాడు. (కోడిమాంసం రుచి చూడని కందమూల శాఖాహారులారా! కోడిమాంసం చాలా రుచియైనది!) స్త్రీ ముఖదర్శనం లేక ఏ యెడారిలోనో నెలలపాటు కాపలాకాసే

సైనికునికి, తోడిసైనికులు రంభలు ! ఇసుకతిన్నెలు లోయలు స్త్రీల స్తనస్థలాలు జఘనప్రాంత ప్రదేశాలు.

బ్రహ్మచారికి ఆవుపొదుగు చూస్తేనే ఉద్రేకం. తన హస్త స్పర్శ ఊర్వశి అంగస్పర్శ—శక్తిలేని భర్తగల మహారాణికి పాలికాపు నలకూబరుడు—కన్యకు స్వకుచమర్దనం సంతోషదాయకం. అలాంటి ఆవశ్యకత లేకుండానే అలాంటి భావాలు, అలాంటి విపరీతాలు, విపరీత తృప్తులుకలవారు ఉన్నారుకూడాను మరికొందరు.

స్త్రీలకు స్త్రీలకు సంబంధం. పురుషులకు పురుషులకు కూడా. తల్లి కొమారులకు, అక్కాతమ్ములకు, మానవులకు జంతువులకుకూడా సంభోగ సంబంధం. ఇదేవిధంగా అనేక రీతులు, పంథలు ఈ లోకంలో. కొందరు నిద్రలోనడుస్తారు. మరికొందరు నడుస్తూ నిద్రపోతారు. కాని అందరూ ఇవన్నీ చేయాలంటే అసంభవం. ఎవరిత్రోవ వారిది. (ఐతే నువ్వెందుకు శాసించి వ్రాయటం అంటారేమో !—అసత్యాభిప్రాయం నేను శాసించటంలేదు. నాకు కనిపించే త్రోవచూపిస్తున్నా. హర్షిస్తే హర్షించండి. లేకపోతేలేదు — ఈ విధంగానే ప్రకృతికి వ్యక్తిత్వం ఇచ్చి, ఇచ్చినవాళ్లుఅంటే సెహభాష్ అనొచ్చు. మాకు అది అక్కరలేదని అనొచ్చు, మరికొందరు నేచెప్పింది వచ్చినట్లయితే !)

ఏత్రోవఐనా నచ్చినట్లయితే అప్పుడు తప్పక ఆ మార్గం అవలంబించవచ్చు. కాని ఇతరులు చేసినంతమాత్రంచేత మనం కూడా అలాగే చేయాలనే శాసనం ఉన్నదంటే నేను ఒప్పుకోను. వాళ్ళు బుద్ధివిహీనులు కావచ్చు, బుద్ధిమంతులు కావచ్చు! ఆ విచక్షణ మనకు ఆవశ్యకం.

ఐతే ప్రకృతే లేకపోతే కవిత్వానికి ఒక లోటు రాదా, అని అంటారేమో! ఏమీ లోటులేదంటాను. దేనివల్లైనా లోటువచ్చే కవిత్వం కవిత్వం కాదంటాను. అది దొంగదేవుళ్ళని, దొంగరాజులని, దొంగప్రజలని సంతోషపెట్టటంకోసం చేసే గారిడీ అంటాను. అలాంటి కవిత్వం నశించిపోయినా పరవాలేదు.

అదేకాకుండా కవిగాడంటే (పద్యం గద్యం కూడా కవిత్వంఏ కాదూ?) నాకు చాలాకోపం. ప్రపంచంలో సాధారణంగా ఎందుకూ పనికిరానివాడు కవిగా తేలుతుంటాడు. ఇక వాడి అబద్ధాలకి, వాడి అవకతవకలకి, వాడిగారడీలకీ, వాడి ఉన్మాదానికి హద్దులేదు. (కొందరు కవులుగాని నిజమైన గొప్ప కవులున్నారు. వారి సంగతి వేరు) అలాంటివారిని అత్యంత నాగరికత పొందిన భావిప్రభుత్వం మిగతా రోగులతోకూడా ఒక్క "క్లినిక్కు" లో పెట్టి వైద్యం చేయించాలి. లేకపోతే ఏమిటి వాళ్ల పిండాకూడు? చంద్రుడుస్త్రీముఖంట, సంధ్యారాగం మధుపానంచేసి మత్తెక్కిన కామిని కండ్ల ఎరుపా? పువ్వు

గుత్తులు స్తనాలా? పద్మాలు, పాదాలు ముఖాలూనా? ప్రకృతి అంతా పచ్చగా ఉందా? సముద్రుడు నదులని కౌగలించు కొంటున్నాడా? కొండలలో, మేఘాలలో, గడ్డిలో దేవుడు కనిపించేడా? పిట్టలకూతలు పాటలా? — అయ్యో ఏమి అన్యాయం! —

అంగుచేతనే ఇలాంటి కవులుకూడా లేకుండాపోతేనే, వాళ్లతోనూ వాళ్ల కవిత్వంతోనూ బాధ పడవలసిన ఆవశ్యకత ఉండదు మిగతా వాళ్లందరికీ. కాబట్టి అలాంటి కవిత్వాన్ని గూర్చి చింతే అనవసరం.

అలాంటప్పుడు ఆకవిత్వంకోసం లేని ప్రకృతిని ఊహాశక్తిద్వారా సృష్టించ నవసరంలేదు—ప్రకృతిలేదు అంతే.

కాని మరొక విషయం చూడవలసియున్నది. ప్రకృతిలేకపోయినా, ప్రకృతిలోఉన్నవి అనేవి ఎన్నో ఉన్నాయి. నక్షత్రాలు, పర్వతాలు, నీళ్లు మేఘాలు వానిని అలంకరించే ప్రాణికోటులు, అవి అన్నీ రమ్యంగా ఉన్నాయి అని, అదే ప్రకృతి సౌందర్యం అని చాలా మంది అంటారు. ఇంకా ఏమంటారంటే ఈప్రకృతిలో ఉన్న పద్ధతి, కట్టుబాటు శాసనం, అందులో మనకొరకు కొల్లలుగా ఉంచబడిన ఉపయోగకరాలైన శక్తులు, విషయాలు, ఒకదేవుడనే స్రష్ట ఉన్నట్లు నిర్ధారణ పరుస్తాయి అని. (ఆహా! ఆఖరికి మూడు రెండు ఐదు అన్నట్లు దేవుడిని సాకలి పద్దుకింద, ఘృతం పాత్రాధారమా, పాత్రం ఘృతాధారమా అనే తర్కం

యొక్కొక్క కుతర్కం యొక్కొక్క సిద్ధాంతంలాగా చేసేసేరే!) ఇదే విధంగా వాదిస్తూ ప్రకృతి అంతా దివ్యంగా ఉందనీ శాసిం చేస్తారు. బాగు మంచిధైర్యం —

కాని అది సత్యానికి చాలాదూరం అని మనకు తోచక తప్పదు. ఏదీ ప్రకృతిఅనే ఈ ప్రకృతిలోఉన్నవి అనుకొనే వస్తువులుఅన్నీ రమ్యంగాఉన్నాయా? సౌందర్యం అంతేనా? అదేకాకుండా ఈసృష్టిలో మనకు కనుపించేదంతా ఒకపద్ధతి, కట్టుబాటు, శాసనంఏనా? అంతేకాక ఈసృష్టిలోజరిగే సంగతులు అందులో ఉన్న శక్తులు విషయాలు మనయొక్క ఉపయోగానికే ఉన్నాయా?—పోనీ ఏరకం శక్తులు విష యాలు అవి ఉన్నా దేవుడనే ఒక తత్వం ఉన్నదని నిర్ధారణ పరుస్తాయా!

ఇదంతా అలాంటిది ఏఁవీకాదు, అలాంటి నిర్ధారణలకు దూకనానికి ఏవిధంఐన హక్కునికూడా ఇయ్యదు.

ప్రకృతి సౌందర్యం ఎక్కడ నిండిఉందీ? గులాబీ పువ్వుఉంది అందంగాఉంది. అందులో సౌందర్యం రామణీయం ఉన్నాయి, కానిఅంతే, అంతకంటే ఎక్కువలేదు. దానికున్నా ముళ్లు ఏఁవీ అందంగాలేవు. చెట్టు పరమ అసహ్యంగాఉంటది. బహ్మచెముడు జ్ఞాపకంవస్తది.

పర్వతాలు దూరాన్నుంచి నీలంగా చక్కగా ఎత్తుగా ఉంటాయి. దగ్గరికివెళ్లి ఎక్కితే వికారం ఐనరాళ్లతో రప్పలతో తుప్పలతో పెద్దపెంట పోగుల్లాగ ఉంటాయి. దూరాన్నుంచేనే వాని సౌదర్యం. దగ్గరికి వెళ్ళితే రంగు కడిగేసి, పళ్ళు, సవరం తీసివేసిన ముసలినటి లాంటిది!

మేఘాలు అంతే. దూరానికి వెన్నముద్దలు. దగ్గరికి వెళ్ళితే అర్థంలేనిపొగ.

ఇంద్ర ధనస్సు బాగున్నది. కాని దానికి కొంచం దూరంగాఉన్న నల్లనిమబ్బు పరమ అసహ్యంగాఉంది, రాకాసి తల విరబోసుకున్నట్లు.

నది నిండా మట్టిబురదా లోతు దిగితే. సముద్రంలో కొద్దిగారత్నాలు ఉన్నా లెక్కలేనన్ని రాళ్లు, అంత నాచు.

కొంతగడ్డి, కొన్ని చెట్లు పచ్చగాఉన్నా, కావలసినంత గడ్డి, ఎన్నో చెట్లు ఎండిపోయి రసహీనంగా కనిపిస్తాయి.

నక్షత్రాలు దగ్గరకివెళ్ళితే మండుతున్న అగ్ని హోత్రాలో, ఆరిపోయిన బూడిదగడ్డలో, (బూడిద అంద విహీనంఐందేకదా! అందుకేకాదూ బూడిదలాంటి విభూతి బోడిముండలు వ్రాసుకొంటారు!) ఇక అగ్నిహోత్రంవా! వేడి బాగున్నా బాగులేకపోయినా మంట నాలుకలలో ఏవీ అందంలేదు. స్మశానంలోని దహన జ్వాలచూడండీ! అస

హ్యాంగా ఉన్నాయి. అదిబాగున్నదంటే, అలా అనేవాళ్ళకి పామునాలుకకూడా చాలాఅందంగా ఉంటది!

పిట్టలు కొన్నిమాత్రం బాగుంటాయి. కాని చాలా పిట్టలు అందవికారంగా ఉంటాయి. కాకి, గ్రద్ద, కోయిల, గ్రుడ్లగూబ, చిలక (రంగుతీసేస్తే.) మొదలైనవి ఉదాహరణ.

జంతువులు చాలవరకు అసహ్యాంగా ఉంటాయి. ఏనుగు, లొట్టిపిట్ట, జీబ్రా, రైనోసిరస్, హిప్పొపోటమస్, ఉదాహరణ.

పాములన్నీ పరమ అసహ్యం. పురుగులు పురుగులే

తాబేలు, చేపలు చాలామట్టుకు (గోల్డుఫిష్ లాంటివి తప్ప) అందవికారంగా ఉంటాయి.

మనుష్యుల్లో కొద్దిమంది తప్ప మిగతా వాళ్ళందరు అందంలేనివాళ్ళు. అనాకారులు.

ఇదేవిధంగా అన్నిటిలో సౌందర్యం చాల తక్కువ. అందవికారం కావలసినంత. ఇలా అందంతో అందవికారంతో ఉన్న ఈ ప్రకృతి అనే వస్తువులన్నీ కూడా, ఎలా అంతా రామణీయకం కలిగి ఉంటాయి? — కొంత వెన్నెల, కొంత చీకటి. అంతే!

ఇప్పుడు ప్రకృతియొక్క సౌందర్యోపాసన ఐంది. ఇక దానిలోఉన్న పద్ధతి, కట్టుబాటు, శాసనం చూద్దాం.

సౌందర్యంఐతే అక్కడక్కడ కనిపిస్తుందికాని, ఈ పద్ధతి, కట్టుబాటు, శాసనం ఎక్కడో ఒకక్షణం మాత్రం తప్ప ఎక్కడా కనిపించటంలేదు ఈ ప్రకృతి వస్తు సంతతిలో.

గోళాలు కోట్లు, కోటి నక్షత్రాలరూపంలో మహా వేగంతో అనంతావకాశంలో తిరుగుతున్నాయి (చూసేరా, వేసేసేను అనంతమైన అవకాశం అని అవసర మొచ్చినపుడు తప్పుకోనానికి!) ఆహా ఎలా అవి ఒకదానితో ఒకటి మరలుత్రిప్పేసి వదలిన కారులలాగ ఢీకొని ముక్కలు కాకుండా ఒకపద్ధతిలో ఒకకట్టుబాటులో ఒకశాసనంలో ఉన్నాయో అని ఆశ్చర్యం, సమ్మతి చూపిస్తూ కొందరు వక్కాణిస్తారు. కాని అది శుద్ధ అబద్ధం. దానిలో ఏవిధం ఐన కట్టుబాటు పద్ధతి శాసనంలేదు మనకు తెలిసి ఉన్నంతమట్టుకు, (మనంఅంటే మనం మన పూర్వులూ కూడా) మనదృక్పథంలోఉన్న గోళాలు ఇంతవరకు ఒక దానితో ఒకటి ఢీకొన నంతమాత్రాన్ని విశ్వంఅంతా వ్యాపించేటట్టు సూత్రం పడవేయటంవే! ఏంఏంసాహసం, ఏంఏం మొండితనం! ఏంఏంఅహంభావం! మన మనుష్యజాతి పుట్టి ఎంతకాలంఐంది, మనుష్యులకి ఈమాత్రంఐనా జ్ఞానం కలిగి ఎంతసేపైంది, శూన్యమైన ఆకాశంలో ఏంవీలేనికాలంలో మొదట నక్షత్రాలగుంపు ఆవిర్భవించి మనుష్య వాసనలేని స్థితిలో ఎన్నికోట్లు సంవత్సరాలు యుగాలు ఉన్నది, ఇంకా ఎన్నికోట్లు యుగాలు ఈ మహా గోళాలు ఉంటాయి మనకు

తెలిసిన చరిత్రకాలం ఈ మహాకాలం అనే వ్యవధిలో క్షణంవలె ఎంత క్షుద్ర మైనది; అని ఆలోచిస్తే ఇలాంటి వెర్రిసూత్రాలు వ్రాసే ఉత్సాహం ఉండదు. మనకు తెలియనప్పుడు మనభూమికి దగ్గరగా ఎన్ని మహాగోళాలు ఒకదానితో ఒకటి ఢీకొని భగ్గున మండిపోయి నశించిపోయాయో! మన భూమితో కొన్ని ఢీకొంటే మనభూమికూడా ఎన్ని ముక్కలై పోయిందో. ఈ మనభూమి అనుకొనేది అప్పుడున్న భూమిలో ఒక వెయ్యోవంతైనా లేదేమో! ఇక ముందుకూడా రేపో ఎల్లుండో, రెండు నెలలకో, ఏభై సంవత్సరాలకో రెండువేల ఏళ్ళకో, ఐదువందల యుగాలకో, మనభూమికి సమీపాన్నిఉన్న మహాగోళాలు అదేవిధంగా మళ్ళీ ఎందుకు ఢీకొని మాయమైపోకూడదూ? ఎవరుకాదని భీమాచేస్తారు. అయోమయంలో ఎప్పుడో వచ్చిన ఈ విశ్వలోకాలు మళ్ళీ అయోమయంలో ఎందుకు మాయమైపోకూడదూ? అందులో గొప్పప్రమాదం ఏమీలేదే! — ఒక వేళ ఇదివరకు ఏమీలేని అయోమయం లేకపోయినా, ఇక ముందైనా, ఎందుకుండ కూడదూ?

అదే కాకుండా మనకు అగోచరంఐన మహా గోళాలు ఈక్షణం అందు ఎన్నిలక్షలు ఢీకొని భస్మమై పోతున్నాయో! కాదని ఎవరనగలరూ? నక్షత్రాలు పడిపోవటంఏమిటి! —

కాబట్టి మన తెలివి, మనబుద్ధి, మనకాలం యే ఎప్పటికి

అన్నిచోట్ల ప్రమాణంగాచేసి, చేసేసూత్రాలు కూపస్థ మండూక పు సూక్తులు, గుంటలోని కప్పల బెకబెకలు.

పోనీచూడండి, మనకు అత్యంత సామీప్యాన్ని ఉన్న విషయాలనికూడా వర్షానికి, గాలికి సరియైన పద్ధతి ఏంవున్నది? భూకంపంలో, అగ్ని పర్వతప్రపాంగులో, వరదలో ఏవిధంఐన కట్టుబాటు గోచరిస్తుంది? మనుష్యులు ఒకరినొకరు చంపుకోవటంలో ఏ శాసనం వెలిగిపోతుందీ! ఏఁవీలేదు భ్రమ.

ఐతే రుతువులమాట, రాత్రి పగలుమాట, గోళాల ఆకర్షణ శక్తిమాట, చావు బ్రతుకులమాట ఏఁవిటంటే, ఇది. జవాబు, రుతువులు ఏవీ సరిగ్గాలేవు. ఒకమారు అధికం, ఒకమారు తక్కువ. కొంచం ముందు, కొంచం వెనుక. ఏవి కనిపిస్తవి వాటిలో పద్ధతీత్యాదులు? ఎండకాయగా కాయగా ఆవిరి పైకివెళ్ళి కొంతసేపుకి చల్లగాలితో వర్షంగాపడటం వర్షం కురిసి కురిసి వెలిసేక మళ్ళీ వర్షం లేకపోవటం. సూర్యుడికి దూరంఐన భూభాగాన్ని చలి. దగ్గరకువస్తే ఎండ. అంతే; లేబొరేటరీలో బడి పిల్లవాడు ఆడుకొనే ఆట.

గోళాలు తిరగటంలో ఆశ్చర్యంలేదు. తిరక్కుండాఉండటంలో ఎంతున్నదో, దీనిలో అంతే ఉన్నది. ఘనజలవాయు రూపాలెట్లు దానికిఉన్నాయో అదేవిధంగా తిరగటంకూడా ఒకరూపం — అదేవిధంగా ఆకర్షణకూడానూ! నల్లగా తెల్లగా

ఉండటం, వేడిగాఉండటం, ఎంతగొప్పో, ఈ ఆకర్షణకలిగి ఉండటంకూడా అంతగొప్పే! అది ఒక గుణం అంతే (కర్త యొక్క విచారణ ఇక్కడ అప్రస్తుతం.)

ఇక చావు బ్రతుకులూ అంతే. దీపం వెలిగి వెలిగి చమురు ఐపోతే ఆరిపోతది. దానిలో పెద్ద పద్ధతి, కట్టుబాటు, శాసనం ఏముంది? —— ఇక ఎలా పుట్టేము అనే సందేహం అనవసరం అది కొంత ఊహవచ్చిన పిల్లలికికూడా తెలుసు!——

ఇదేవిధంగా అన్నీ. కొన్ని కొన్ని సాధారణంగా జరిగిపోయి నంతమాత్రాన్ని వాటిలో ఏవిధంఐన మహా దాశయం కట్టుబాటులు మొదలైనవి ఉన్నవని అనుకోవటం పొరబాటు. ఎక్కడైనాఉంటే ఉండవచ్చు కాని అది విశ్వం అంతా ఉందనటం సాహసం, అన్యాయం, అనవసరమైన గొడవలు తెచ్చి పెట్టుకోవటం.

ఉన్నాయి అనేక శక్తులు, వస్తువులు, విషయాలు, ప్రకృతి అనేవి. అవన్నీ ఒకతీరైనా లేకుండా గత్తరగా, చెల్లా చెదరై ఉన్నాయి (ఆపద్ధతి తప్ప ఇక ఏపద్ధతీ కనుపించదు!)

ఇక ఆఖరివిషయం. ఈ ప్రకృతి అనేదానిలో ఉన్నవి మనకోసంఐ పుట్టింపబడిన ఉపయోగవస్తువులు, ఒక దేవుడనే శక్తినికూడా నిర్ధారణ పరుస్తాయి అని సూక్తి.

కాని ఆసూక్తి అసత్యం అగోచరం. ఈసృష్టిలోఉన్న మనుకొనే వస్తువులు శక్తులు మనకోసంలేవు. ఉండవలసి అవి

ఉన్నాయి. ఒకరి ఉపయోగంకోసం కాదు. కొండలు, మేఘాలు, చెట్లు, పువ్వులు, ఫలాలు, గాలి, నీరు, విద్యుచ్ఛక్తి మొదలైనవి మనం ఆనందించనానికి కాని మనం ఉపయోగించనానికి కాని లేవు. అవి ఉన్నప్పుడు వానిని మనం కొంచం ఉపయోగించుకొన్నంత మాత్రాన మనకోసం వాటిని ఎవరో పుట్టించేరని అనుకోటం కొంత అజ్ఞానంకాదూ? లేకపోతే మనమే వాటికోసం ఉన్నామని అనుకోటంలో మట్టుకు ఏం తప్పున్నదీ? మనం విడిచిన గాలి చెట్లకి ప్రాణం, మనశరీరం యేవేః అనేకక్రిములకు ఆహారం. అంతేకాక మనలని చూచి పువ్వులు ఆనందిస్తున్నాయో! ఏమో!

కాబట్టి వస్తువులున్నందుచేత మనం వానిని జబర్దస్తీ చేసో లేక మహాసత్రంలో నెమ్మదిగా ప్రవేశించినట్లో, అనుభవిస్తే, అవి మనకోసంవే ఉన్నాయనుకోటం అన్యాయం. మనుష్యుడు ఎంతక్షుద్రమైన పురుగు, విశ్వవస్తువులు ఎంతఅత్యంతాధిక్యతకలవి! — అలాంటప్పుడు ఈ క్షుద్రమానవుని కోసంవేనా ఈ సృష్టికార్యం!

ఉంకోవిషయం: ఈ ప్రపంచం మనఉపయోగం కోసంవే ఐతే, అగ్నిపర్వతాలెందుకు, ఉప్పెనలెందుకు, తాచుపాములు ఎందుకు, అశనిపాతాలు ఎందుకు! అవి అన్నీ మన కాట్టే యుపయోగంగాలేవేమో! —

ఇలాగేచూస్తే విశ్వం మనకోసంఉన్న వస్తువులతో నిండి ఉన్నదనే భావం నశించిపోతది. అది నశించి నప్పుడే

అన్నిపనులు మనకోసమేచేస్తూ అనుకూలంగా దేవుడుకూడా ఉన్నాడుఅనే భ్రమ పోతది.

అదేకాకుండా సృష్టికార్యానికి భగవంతుడుండవలసిన అగత్యంలేదు. రాయిరాయి రాసినప్పుడు నిప్పు పడినట్లు ఈ సృష్టిలోని వస్తు సముదాయం ఒకరి ఆధారం లేకుండానే ఒక సృష్టికర్త అవసరంలేకుండానే వచ్చి ఉండవచ్చు. బ్రహ్మ స్వయంభూ ఐనప్పుడు బ్రహ్మాండానికి ఆశక్తి ఎందుకుండ కూడదూ? మనంచేసిన కొన్ని యంత్రాలు మనసహాయం లేకుండానే క్రొత్త వస్తువు లను సృష్టించినప్పుడు సృష్టి తనంత తాను సృష్టించుకోలేదూ? అలాగే కాకపోతే ఏమాత్రంఐనా ఘనతలేని ఎన్నో వంకలు లోటులు (నీరుపై కిప్రాక లేకపోవటం, వండిన అన్నం భూమిలోంచి రాకపోవటం, వేసంగి కాలంలో గాడుపు, శీతకాలంలో చలిగాలి, సారహీనం ఐన ఎడారి, గుచ్చుకొనే ముళ్ళు మొదలైనవి) ఉన్న సృష్టి కార్యభారం భగవంతుడనే శక్తిమీద వేయాలా? అది తప్పు. ఈ అవకతవకల సృష్టికి భగవంతుడు అనవసరం. అందుచేత సృష్టిఅనే ప్రకృతి అనే వస్తుసముదాయం భగవంతుడున్నాడని ఏమాత్రం స్థిర పరచదు.

కాబట్టి ప్రకృతిఅనేదిలేదు. దానిలో సౌందర్యం. కట్టు బాటులు మొదలైనవిలేవు. దానికికర్త అనవసరం–ఇది క్రొత్త సూక్తి. సిద్ధాంతంకాదు—అనుమానం! —

# 9. కవిత్వం-సంగీతం-చిత్రలేఖనం - శిల్పం.

కల్పన అది పద్యగద్యాత్మకంఐ కావ్యజాలంఐ కవిత్వం అనే సంకుచిత నిర్వచనానికి లోనయింది. అదే స్వరరాగతాళ బద్ధంఐనప్పుడు సంగీతం ఔతది. ఆకల్పనే రంగులతో గీతలతో రూపందాల్చినపుడు చిత్ర లేఖనం అని, మృన్మయంగానో, శిలారూపంగానో ఉద్భవించి నప్పుడు శిల్పం అని పేర్లుధరిస్తది. కాని అంతర్భాగాలకు వేరు వేరు పేర్లు పెట్టుకొన్నా, అది అసలులో ఒకటే. అది కల్పన.

ఈకల్పన గురించి ఎంతో గ్రంథం పెరిగిపోయింది. ఏవేవో ఉద్దేశాలతో, ఏవేవో ఆశయాలతో, ఏ వేవో కలలతో, ఎంతమందో ఎన్నాళ్లనుండో ఏవేవో ఏకధాటిగా శలవిచ్చారు. మహా సౌధనిర్మాణంచేసి (గాలిలోనైతేనేమి!లెండి!) వెన్నెలలు వెదజల్లి (నాటకరంగంలోని బూటకపు వెన్నెలైతేనేం!) పన్నీరు ఒలికించి (అత్తరపుసాయిబ్బుచేత్తో కలిపిన, కానీ అత్తరు నీరు కానీయండి!) ఈకల్పనకి శాశ్వతమహా సామ్రాజ్య పదవీపట్ట భద్రత్వం కలుగజేసేరు. దీనినేకళ అన్నారు — కళోపాసకులంమేం అన్నారు—జీవితానికి జీవనం అన్నారు— భగవంతుడుకూడా దీనియందు లోలతకలవా డన్నారు. పశు డన్నారు (సామగానలోలా! అని) దీనికి అవధిలేదన్నారు. నిరంకుశత్వం తగిలించివేశారు.

ఈ విధంగా ఆ కల్పనత్వానికి అగ్రస్థానం ఇచ్చేనేరు. ఒక అగ్రస్థానం ఏమిటి సర్వస్థానం ఇచ్చేనేరు. తమరు అ కల్పనా కారులం అని ఆ సర్వస్థానాన్ని అగ్రస్థానాన్ని ఆక్రమించు కోనానికి యత్నించేరు — ఆహా ! ఏమి అన్యాయం. ఏమి ఘోరం !

చూడండి కల్పనంయొక్క అంగం ఐన కవిత్వంయొక్క తమాషా—కవిత్వం ఒక మహాబూటకం, తోలు బొమ్మలాట. అద్దాల తమాషా — మరికాదూ, కల్పనలోనే ఉందిగా ఆ సూచన !—అది ఒక కృత్రిమ సృష్టి—మానవులకి కృత్రిమం ఇష్టంకావచ్చు. కల్పనమీదే మోజు అయ్యిఉండొచ్చు కాని అంతమాత్రాన కృత్రిమం కృత్రిమంకాకపోదు. కల్పన కల్పన కాకపోదు — ఒకవేళ సృష్టే కల్పన అని శాసిస్తారో! శాసించినా కల్పనయొక్క మూల గుణం మారదు ("వెనుకటి గుణమేల మాను వినరానుమతీ!")

కృతిమ సృష్టి ఐన ఈ కవిత్వాని యొక్క నైజం చూడండి. ముఖాన్ని చంద్రుడని అనటం. శుద్ధ అబద్ధం. ముఖానికి చంద్రునికి పోలికేలేదు. చంద్రుడులాగ ముఖంఉంటే, నోరూ, చెవీ, కన్నూ, ముక్కులేని ఇడ్డీన ముక్కలాగ ఉండి అది ముఖంవ కాదు. అదే విధంగా, ముఖంలాగ ఉంటే చంద్రుడు చంద్రుడేకాడు. అది ఒక భయంకరం ఐన భూతం ఐపోతది!

అలాగే ఎన్నో అబద్ధాలు. హద్దులేదు. చేతులూ, తామర తూళ్లలునా, కళ్ళూ పద్మపత్రాలునా, ముక్కూ సంపంగి పూవూనా, పాదాలూ, మళ్ళీపద్మపత్రాలూనా (కంటికీ పాదానికీ ఎక్కడైనా సంబంధం ఉందా!) కాళ్ళూ, అనటి కంబాలునా, పిరుదులూ, ఇసుక తిన్నెలూనా, నూగారూ చీమలబారునా, స్తనాలూ బంగారు కుండలునా, అయ్యో ఏమి ఉన్మాదం, ఏమి అతిశయోక్తి, ఏమి అన్యాయం! ఈ ఘోరం ప్రత్యక్షపరచటం అవసరం ఏ ఐనట్లయితే, సంపంగి పూవునీ, తామరరేకులనీ, తామర తూళ్ళనీ, బంగారు (వీలుకాక పోతే ఇత్తడి!) కుండలనీ, అనటికంబాలనీ, ఇసుకతిన్నెలనీ, చీమలని, ఆఖరిని మళ్ళీ పద్మపత్రాలనీ మానవ కవి వర్ణించినట్లు వరసగా పెట్టి చూడండి! ఎంత ఘోరంగా ఉంటదో! రూపం ఏ ఉండదు!

చాలావరకు కవిత్వ జగత్తు అంతా ఇంతే. వెన్నెల వేడి అంట. చీకట్లు దుఃఖం అంట. తెలుపు సత్ అంట. పిట్ల కిచ కిచలు రాగాలంట. మేఘాలు దూతలంట. చుక్కలు స్త్రీలంట. చంద్రుడు భర్తంట (సూర్యుడు, చుక్కల ప్రియుడో, రంకు మొగుడో! ఎంచేతంటే సూర్యకాంతేగా చంద్రునికి జీవాన్ని ఇచ్చేది! ఆజీవనాన్ని వెదజల్లి భర్త అయ్యేడు, గంభీరంగా తార్పుడు కాడైన చంద్రుడు!)

ఇంకా, ఆకలి బడబాగ్ని అంట. స్త్రీ మాయ అంట. (ఇది అంత ఎక్కువ అతిశయోక్తి కాదేమోలెండి!) ఆమె

అబలయంట, హృదయం పుష్పంఅంట, నిశ్వాసం తావి అంట, ప్రత్యూషం ఉషఃకాంత అంట, సంధ్యారాగం తప్పత్రాగి నట్టియో లేక రతిచేసి అలసిన ప్రియురాలి కంటిఎరుపు అంట.

లత మానుని కౌగలించుకొంటుందంట, పరుగెత్తుకొని వచ్చిన నదులతో చేతులు చాచుకొని ఉన్న సముద్రునికి నిత్య కల్యాణం, నిత్యసంభోగం! (ఐతేనురగ!—ఓహో కవి హృదయం!) డబ్బై్బవళ్ళ పదాలుకట్టే వెర్రిముండా కొడుకు కూడా కవికుమారుడట! హద్దులేదు! అహంభావం! అసత్యం! అసహ్యం!)

ఇంకాచూస్తే ఇంకాగుజిప్స. మసిపూసి మారేడికాయని చేయటం. తాటాకుచప్పుళ్లతో కుందేళ్లని బెదిరింపబోవటం. డాకు రేకులపూత పూయటం. రేడియోలోచేసే సీనారేకు యొక్క మేఘ గర్జన.

పచ్చగడ్డిచూస్తే శరీరం భగ్గుమన్నాదంట. గడ్డి పువ్వునుచూస్తే బ్రహ్మాండాన్నిమింగేసే ఉద్దేశాలు కలిగే యంట. రాళ్లనుచూస్తే బ్రహ్మరహస్యం బ్రద్దలైనదట - ఒకటా అవకతవక!—

అదేకాకుండా తనరచన శాశ్వతత్వం పొందిందని అను కోవటం కవిగాడు. తనదానికన్నా గొప్పకవిత్వం లేదనుకోవటం. అసలు కవిత్వం, లేనిదాన్ని పుట్టించటంకదా, అబద్ధాల

అందంకదా, ఎందుకు దీనికి శాశ్వతత్వంకూడానూ! ఆమాత్రం ఆలోచనఐనా లేదే.

పైపెచ్చు తన సృష్టి సత్యంఐందని ఢంకా కొట్టి చెప్పటం! (ఎవరు నమ్ముతారులెండి!) అసలు ఏవీలేని దాన్ని సృష్టించటంలో, ఏవీ జరగని విషయాన్ని జరిగిందని చెప్పటంలో (జరిగింది జరిగినట్లుగా చెప్పితే ఇక వీడిగొప్ప వేవున్నది!) సత్యం ఎక్కడున్నదో నాకు తెలియదు. నాకంత జ్ఞానంలేదు.

సాధారణంగా అబద్ధాలవ్రాతలో, (అది కవిత్వంయొక్క నిర్వచన,) పనికిమాలిన వాటిని గురించి వ్రాయటం. ఎవరికి నిజంఐన ఉపయోగం ఉండకుండా వ్రాయటం. అబద్ధంలోఐనా మంచి ఉపయోగించే అబద్ధం ఐనా ప్రయోగించకూడదూ! గ్రుడ్డిలో మెల్ల!

ఉంకోవిషయం ఏవిటంటే కవి తాను గ్రుడ్డివాడై ప్రపంచంఅంతా గ్రుడ్డిదనుకుంటాడు. తన ఉన్మాదం ప్రపంచానికిఅంతా ఉన్మాదం అని అతనిఊహ!—లేకపోతే తాను నిజంగా వ్రాసినంత మాత్రాన నిజంగా అదిఎలా గ్రహింపబడతదని అనుకోగలడూ? తాను వ్రాసింది వేదవాక్కా! రెండు మూడు మాటలు యతి ప్రాసలతో పడేసినంతమాత్రాన్ని ఎలా ప్రతి సృష్టి ఐపోయిందని అందరూ అనుకోవాలని అనుకున్నాడూ?

తన మోసం తననే మోసగిస్తుంది. చీకటిలేనప్పుడు తానెంత చీకటిఉన్నదని వర్ణించినా చీకటిలేదు. వెలుతురు లేనప్పుడు ఎంత పెద్ద జ్యోతిని వెలిగింప యత్నించినా వెలుతురు ఉండదు.

తాను గొప్ప విషయాలను గురించి వ్రాసి నంత మాత్రాన, తాను గొప్పవాడని ఎవ్వడూ అనుకోడు. తాను పనికిమాలిన వెధవ అయితే, పనికిమాలిన వెధవ క్రిందే స్వీకరింప బడతాడు. తన గ్రంథరచన అట్టే సహాయం చేయదు.

అది అలా ఉండగా, తాను తన అనుభవాలను, కలలను (సత్యా సత్యాలమాట ఎత్తవద్దు!) ఉన్నవి ఉన్నట్లుచిత్రిస్తా నంటాడు. నిజంగా అలాగేచేస్తే ప్రభుత్వం కారాగారంలో తోసివేస్తుంది. నలుగురు తప్పట్లు కొట్టి నవ్వుతారు. ఇంకొక వ్యక్తియొక్క భార్యనో భర్తనో కామంకొరకు మనసులోఐనా కోరి (ప్రపంచాన్ని ఎవ్వరూ అలా కోరరంటే అది నమ్మంలే!) ఆవిషయం స్పష్టంగా పేరుతో సహా వ్రాయమనండి, ఏమౌ తదో చూద్దాం!—ఇలాగే ఎన్నో ఉదహరించవచ్చు. కాని ఎందుకు గ్రంథవిస్తరణ!—

పోనీ తాను వ్రాసినవి వేడివేడిగా పొంగు గుబ్బ పాలా!— అచ్చే అదినాస్తి. ఆకలి తీసికోండి. ఆకలిగురించి బాగావ్రాయొచ్చు. కాని నిజంగా కలకల మని ఆకలి మండే టప్పుడు ఆభావాలనీ కవిత్వంలోపెట్టే ధీరుడుకాడే. అంత

ఆకలి వేసినప్పుడు అన్నంతింటాడు, లేక ఆప్రయత్నంలో ఉంటాడు. ఆప్రయత్నం ఫలించకపోతే కళ్లు తేలవేసి సొమ్మ సిల్లి పడతాడు (అదికవిత్వ తన్మయతకాదేమో!) ఏదో అంత తక్కువ బాధలేనప్పుడు కొంత వ్రాయవచ్చు. కాని దానిలో వేడి సహజత్వం చాల వరకు నశిస్తది. అప్పుడు వ్రాసేది కొంత ఆరిన పాలు. (వాల్మీకిని, కాళిదాసుని, హోమరుమని, సన్నయభట్టుని, సోమనాథుని, షేక్స్పియరుని, షెల్లీని, ఉమరు ఖయాంని, నగూచీనీ, గోట్టేనీ, రవీంద్రుణ్ణి, బెర్నార్డుషానీ, నట్టుహేమ్సున్ని, లిన్యుటాంగునీ వీలైతే అడగండి!) ఇదే కవిత్వంయొక్క ఘనత! వట్టికల్ల.

ఇదేవిధంగానే సంగీతంకూడా. లేని భావాలని కల్పించి పుట్టించి మాయ జేయబోవటం — సుఖంగా ఉన్నంత మాత్రాన్ని (అదైనా చాలాబాగుంటేనేకాని, అసుఖాన్ని యియ్యదు మానవులను దేవతలగా మార్చదు. ఏదో కూనిరాగం, ఏదో మ్రోత! అంతే. దాన్ని ఒకపెద్దదానిక్రింద మార్చటం మోసం. చిన్న విషయాలని చిన్నవాటిగానే ఉండ నియ్యండి (బెథూవెన్ను, మార్కుహేంబగ్, సంగమేశ్వర శాస్త్రిని, రామానుజయ్యం గారిని, వేంకటస్వామినాయుడుని, డీనాదర్బిన్ను, పాల్ రాబన్సన్ను, యం. యస్. సుబ్బు లక్ష్మిని అడగండి.)

చిత్రలేఖనం అంతే. రంగులతో ముగ్గు. జీవనం

పోయటం అబద్ధం. ఎంతరంగువేసి కళ తెచ్చినా, బొమ్మ బొమ్మే—అంతకన్నా ఏఁవీలేదు. (మైఖేలు ఏంజెలోను, రాఫేలును, రవివర్మని, దేవీ ప్రసాద్‌రాయిని అడగొచ్చు.)

వీటి అన్నిటి మోస్తరుదే శిల్పం. రాతిని మట్టిని ఎంత తీర్చి చిత్రించినా రాయిరాయే, మట్టిమట్టే. మాటామంతీ లేదు. నిట్టూర్పుఇయ్యలేదు. (పూర్వపు గ్రీకుశిల్పులనూ, లేక ఎల్లోరాశిల్పులను, లేకపోతే ఇప్‌స్టిన్‌ను అడగొచ్చు.)

కాబట్టి ఈలలితకళలనే ఇవి అన్నీ కల్పన మాత్రములు వీనిలో మహాగొప్పతనం ఏవీలేదు. వీనిని తయారుచేసే వారిలో కూడా ఏవీఁ మహాగొప్పతనంలేదు. ఈ విషయాలని బహ్మాండంగా బహ్మారథం పట్టనక్కరలేదు చాలాచిన్నవి ఇవి.

ఇవి ఒక చిన్న గాలివీటు. ఒక చిన్న గిలిగింత.

కాని ఈ చిన్నగాలివీచే మన జీవితాలకి ఊపిరి కావచ్చు. చిన్నగిలిగింతే మన జీవన పరమావధియేమో!

---

# 10. సంఘ చమత్కారం.

మనుష్యులకి గుమిగూడటం కలసి బ్రతకటం ఒకసహజ గుణం అని కొందరు వేత్తలు చెప్తారు. (జంతువులకిగూడా అదేగుణం అని నేను నొక్కి చెప్పగలను!) అలా గుమికూడి అలా బ్రతికేగుంపుకి (సమూహంఅంటే కొంత మర్యాదాగా ఉంటదేమో!) సంఘం అని నామకరణం చేసేరు.

కాని జాగ్రత్తగాచూస్తే సంఘంలో గుమికూడి బ్రతికినా, మనిషి (అంటే అసాధారుణులకాదులెండి) తనకోసం తన స్వార్థంకోసం బ్రతుకుతాడు. సంఘం కొరకు బ్రతకడు. దానికోసం దానిలో చేరడు. తన స్వలాభంకొరకు దానిలో కలిసి ఉంటాడు. ఆస్వలాభం అనేక విధాలుగా ఉండొచ్చు. శారీరకంగానేకాదు, మానసికంగా (ఆధ్యాత్మికంగాకూడా అంటే చాలా డాబుగా ఉంటది) కూడా ఉంటది. అదే తృప్తి. వాంఛా నివారణదాహం తీర్చుకొనేభావం. హాయి తన హాయి.

ఈ హాయికోసం పుట్టినదిమొదలు చచ్చేవరకు మనుష్యులు ఒకటేయత్నం. విధి విరామం లేకుండా పిచ్చికుక్కల్లాగ ఈ హాయిని సంపాదించ యత్నిస్తుంటారు.

అలా హాయికోసం సంఘ నిర్మాణం చేసుకొని కూడా ఎంత ఫలితాన్ని ఎలాంటి ఫలితాన్ని పొందుతారో చూద్దాం.

అలాచూసే యత్నంవే కొంత సరదా కొంతహాయిని ఇస్తది—బ్రతికిఉన్న కప్పని చర చర కోసి దానికడుపులోని తమాషాలను చూసి కులికే భవిష్య ద్భిషగ్వర్యునికి గలిగే హాయిలాంటిది.

అదిగో సంఘం! దివ్యంగా వెలిగి పోతంది ఫెళ ఫెళ మనే ధ్వనితో. చిన్నప్పుడుచూసిన తోలు బొమ్మ లాట సన్నాహం జ్ఞప్తికి వస్తది!—ఈసన్నాహానికి ఆకాశంవేంపందిర, భూమే అరుగు, దిక్కులే అవధి. ఇంత వైశాల్యంకలిగిన రంగాన్ని జరుగుతున్న అన్నివిషయాలని చూడనానికి వ్యవధి లేదు, కళ్లులేవు.

కాని కొన్ని కొన్ని చూడొచ్చు. అవే కోటి కోట్లు మనకి.

అక్కడ చూడండి! వందలు వందలు మనుష్యులు — రెండుకాళ్ల, రెండుకళ్ల, రెండుచెవుల, ఒకముక్కుల, ఒక నోరుల, ఎన్నో వంకరతిరుగునాలుకల, అనేక మనసుల, వింతజంతువులు—చీమలలాగ, పేడపురుగులలాగ, కలరా క్రిములలాగ ఒకళ్లమీద ఒకళ్లుపడుతూ, కోతుల్లాగ కిచకిచ లాడుతూ, గొర్రెల బృందంలాగ మూగేసేరు. ఏవీఁ ఉత్సాతేఁవోఁ! సంఘ మరణఁవోఁ, సంఘజననఁవోఁ! ఆ, లేక రెండిటికీ కారణంఐన సంఘ సంభోగఁవోఁ!—ఆ, దృష్టి పారింది.

తెలిసింది ఒక పెద్ద పార్టీ అట. విందుకోసం వచ్చేసేరు. చాలా చాలా గొప్పవారు—వారి మధ్య కలిసిపోయి తలలోని పేలు లాగున అక్కడక్కడ నక్కి ఉన్నారు వారంత గొప్పవారు కానివారు—ఆడవాళ్లున్నారు, మొగవాళ్లున్నారు (వాళ్ళూ వీళ్ళూ కానివాళ్ళు ఉన్నారు!—)

వీళ్ళందరూ రానానికి కారణాలు ఇతరాలెన్నున్నా (అవి మనకెలా తెలుస్తాయి!) ఒకటేమిటంటే ఈవిందు దమ్మిడీ ఖర్చులేకుండా వచ్చిన విషయం (ఇది అక్కడున్న త్రొంభై తొమ్మందుగురికి వర్తిస్తది. వర్తించని అతిథి దేవులుకాని, విందు ఇచ్చేదాతఉంటే వాడి లేక ఆమెవిషయం వేరు—రెండు వేల రూపాయలవిందుతో రెండుమూడక్షరాల బిరుదో, లేక ఇరవై వేల, లేక దానితోసమానంఐన లాభంటే వచ్చే ఎత్తో వెన కాల ఉంటది. అదీ ఇదీలేక వెఱ్ఱి వెంగళప్పలలాగ ఇచ్చే వెఱ్ఱి దాతఐతే, వాడి లేక ఆమె ఖర్మం అంతే!)

ఆహా ఏమి కన్నులవిందు! అదిగో బోడిగుండు ఖాళీ నెత్తి గుమ్మిపండు పెద్ద అస్వామి తన సహజంగా అసహ్యంఐన ముఖాన్ని ఒక పనికిమాలినవవ్వు తగిలించి ఇతోధికంఐన అస హ్యాన్ని కలుగచేస్తూ ఉంకో పెద్ద అస్వామి పెద్ద భార్యతో (అంటే ఘనతకలిగిన అన్నమాట! — శారీరకంగా కానీ యండి, ఇతరం కానీయండి!—)మాట్లాడుతున్నాడు. దగ్గరగా

వింటే మర్యాదకాదని కొద్దిదూరంనుంచే విందాం విననట్లుగా ఆ సమయాన్ని నోరూ ముఖంకూడా పలికేయి.

అతడు నోటితో— "తమరు కులాసాగా ఉన్నారా!" ముఖంతో శబ్దంలేకుండా, "ఓసిముండా! ఎంతబలిసేవే!" "తోలుతిత్తుల తోలుబొమ్మా!—"

ఆమెనోటితో "ఈ మధ్యనే నాకు పని ఎక్కువచేత సుస్తీచేసింది.—"ముఖంతో నిశ్శబ్దంగా "నీ కెందుకు నా సంగతి!—అదేకాకుండా నీపెళ్లాం లంజ ఉండగా నీకు ఇంత మాత్రంమైనా మాట్లాడనానికి ధైర్యం ఎలా వచ్చింది!"

ఒకచోట ఒకస్త్రీ ఇలా అన్నది తన మిత్రురాలుతో "చూడు దానిగుబ్బ లెలా పొడుసుకొస్తున్నాయో!" జవాబు "అబ్బే జారిపోతే పైకి కట్టింది." ఇంకోచోట ఇద్దఱు స్త్రీలు మాట్లాడుతున్నారు.

ఒక ఆమె వినిపించేటట్లు "ఆమూల ఆమె, అతడు సిగ్గు లేకుండా ఎలా మాట్లాడుతున్నారో!"

మనసులో "నాకు అతడు లభిస్తే బాగుండును."

రెండవఆమె పైకి "ఈ కాలాన్ని అన్నీ ఇలాంటి అసభ్యం పనులే!"

లోపల, "ఓలంజా నువ్వా చెప్పాలా! ఎంతమంది నొక్కలేదూ నిన్ను! నా స్నేహితుణ్ణి తీసుకుపోలేదూ!" మరియొక చోట ఇద్దరు పురుషులు మాట్లాడుతున్నారు.

ఒకడు పైకి "ప్రస్తుత రాజకీయ పరిస్థితులు మారితేనే కాని దేశానికి శాంతి ఉండదు."

మనసులో "నాకు మంత్రిపదవి ఎప్పుడు వస్తదో!"

రెండవ మహానుభావుడు పైకి, "అవును అనేక అన్యాయాలు జరుగుతున్నాయి."

లోపల, "ఇంకా దేనికోసం ఏడుస్తున్నావురా? నీవు చితికి పోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నా వెఱ్ఱిముండాకొడుకా!"

అందరూ తెగతిన్నారు. అందరూ మనస్సులో రహస్యంగా విందు ఏడ్చినట్లుందన్నారు. పైకి దివ్యంగా ఉన్నదన్నారు.

ఉంకోచోట ఒక సభ జరుగుతుంది. అందరూ సంఘ సంస్కర్తలే, అందరూ దేశోద్ధారకులే, అందరూ విశ్వమానవ కల్యాణ కాంక్షులే (అందరూ పందలని, అందరూ దద్దమ్మలని, అందరూ స్వలాభ కాంక్షులని ఎవరైనా అనుకోవచ్చు, కాని పైకి అంటారా, అంటే వాళ్లు ఇక బ్రతకగలరా!)

అక్కడ దేశం ముక్తి ముఖ్యంగా కావాలన్నాడు ఒకడు తనముక్తి ముఖ్యంగా కావాలనుకొన్నవాడు. ప్రభుత్వం ధ్వంసం ఐపోవాలన్నాడు మరియొక అధునాతన విప్లవ కారుడు—వాడికి ప్రభుత్వం వల్ల ఏలాంటి లాభం అంతవరకు కలుగలేదు—ప్రభుత్వం తానూ నిద్రాహారాలు లేక ప్రజల

కోసం కష్టపడుతున్నాం అని ఒక మహానుభావుడు శలవిచ్చేడు—ఆయనకు ప్రభుత్వం వల్ల చాలా లాభం కలగటంవ కాకుండా ప్రభుత్వానికి పునాదిలాంటి మహోద్యోగి.

అన్యాయం సహించలేనన్నాడు. లంచంతీసికొని ఒకని గొంతుకు కోసిన అస్సామి. అపవిత్రం, అపవిత్రం అని శాసిం చేడు సవతితల్లిని చూచి ఉబలాటపడే ఉత్తముడు. క్రౌర్యం నశించాలన్నాడు ఒక అభినవ బుద్ధుడు. (పాషాణం ఇచ్చి తన సౌభాగ్యసోపానం కట్టుకొన్నాడు లెండి ఆయన ఒకప్పుడు)—సర్వస్వామ్యం కావాలన్నాడు దమ్మిడీ గతిలేని సామ్యవాది. సృష్టిలో హెచ్చు తగ్గులున్నాయని శలవిచ్చేరు దౌర్భాగ్యుల నోట్లో మన్నుకొట్టి కోటీశ్వరుడైన వివేకి.

గృహంవ దేవాలయం అని ఉపన్యసించింది తన యింటి లోనే పరపురుషుని కౌగిటిలో కలిసే గృహదేవ తార్చకు రాలు. పురుషులతో కలిసి చదువుకోటం అనర్ధకం అన్నది స్త్రీల తాకులలో కులికే స్త్రీ శిరోమణి.

పిల్ల లనవసరం అన్నది మాచకమ్మ — స్త్రీ పురుష సంపర్కం తుచ్ఛం అన్నాడు అన్ని ఉడిగిన నపుంసకుడు.

అందరూ మాట్లాడేరు, ఎవ్వరూ వినలేదు. బయట గాడిద లరిచేయి. ఇంకా కొన్ని కొన్ని విషయాలు అక్కడక్కడ చూద్దాం! అదిగో! ఒకచోట ఒకనాడు ఒకభార్యా

భర్తలు తమ వివాహవార్షికం చేసుకుంటున్నారు. ఆనాడే భర్త ఉంపుడుకత్తెలు, భార్య రంకు మొగుడులు సంబరంచేసుకొన్నారు.

మరిఒకచోట కొండంత పందిరేసి భూమంత అరుగేసి పెండ్లి పెళ్లుమని జరిపేస్తున్నారు. పెండ్లికూతురు ఉబలాటం కన్నా ఆమె అక్కల ఉబలాటం ఎక్కువ. పెండ్లికొడుకును మించిపోయి అతని అన్న దమ్ములు మించిపోయేరు. అన్నిటి కన్నా ఊళ్లో కుక్కల హడావిడి ఎక్కువైంది. పెండ్లి, పెండ్లి, ఏమైతేనేం!—నిత్యకల్యాణం! ఇంకొకచోట.

ఆఫీసులోకూర్చుని తప్పత్రాగే యుగంధరుడు, తన పూర్వమిత్రుణ్ణి చూడలేడు కాని, ఓట్ల సమయాన్ని తన గుమాస్తా ఇంటికి వెళ్లి అతనితో జట్టా పట్టీలు వేసుకుంటాడు.

ఇక వేరేచోట ధనికుడైన తన బంధువునిచేరి తన సర్వస్వం అవసరమైనప్పుడు అతనికి అర్పిస్తానని చెప్పిన మహా వాగ్దాత అవసరంవచ్చినప్పుడు వానికి ఒక దమ్మిడీఐనా ఇచ్చి సహాయం చేయలే నంటాడు.

ఇంకోస్థలాన్ని చచ్చిపోయినవాడికోసం కొందరు ఏడ్చేరు—నవ్వినవాళ్లు లేకపోలేదు—కాని బ్రతికి ఉన్నవాడు ఇంకా చావ లేదని మరి ఎందరో ఏడ్చేరు. సెహభాష్!—

మాయ, ఇంద్రజాలం, గుద్దులాట, వల్లకాడు. చిన్ని పువ్వులచివర మహాగరళంకల చిన్నిమూదులు. ఇది సంఘం. ఇదే చమత్కారం. ఇదేనవ్వు ఇదేహాయి ఇదే అధ్వానం.

---

# 11. దొంగ.

చిన్నప్పుడు ఎన్నో అబద్ధాలుచెప్పి తల్లిదండ్రులు, పెద్ద వాళ్లు పిల్లలిని అసత్యజీవనంతో నింపేస్తారు! అనవసరంఐన భయాలని పుట్టించి పిరికి పందలగా మార్చేస్తారు. ఈవిధంగా భ్రష్టలగా చేసే పంథలలో రాజమార్గం. "అదిగో దొంగో వొస్తున్నాడు" అనే అసత్య ప్రలాపం.

దొంగనేవాడు ఒకవిధంఐన ప్రత్యేక మనిషి అని, వాళ్ల తెగ మనం పురాణాలలోఉండే రాక్షసులకు మానవులకు మధ్యగాఉండే ఒకక్రూరసృష్టి విశేషం అని నాచిన్నతనంలో—(అంటే ఇప్పుడు పెద్దతనం వచ్చింది అనికాదు)—నేను అనుకొనే వాణ్ణి. కొన్నాళ్లకి దొంగనేవాడు ప్రత్యేక సృష్టి విశేషం కాదనీ, మనలో ఒకడే అని తెలిసికొన్నప్పుడు, దొంగ చుట్టూఉన్న అసత్య విశేషం మాయంఐపోయింది, దాని మీాద ఆధారపడి ఉన్న భయంకూడా అంతరించింది.

కాని దొంగలు ఎక్కడో అరుదుగాకాక, మనచుట్టూ ఎప్పుడూ ఉండే మానవజాతిలో నూటికి తొంభై తొమ్మండ్రు గురుఐ, మనవే ఐఉన్నట్లుగా గ్రహించి నప్పుడు, ఒకక్రొత్త నవ్వు, ఒక వింత వెలుగు ఉద్భవించేయి.

ఇదంతా దొంగలగుంపా, నేనూ దొంగలలో ఒక డనా!—సెహభాష్!

సింహావలోకనం. పైకన్నుమూసి లోకన్ను విప్పేను. తెలిసింది, తెలిసింది;—పోనీ తెలిసిందనుకొన్నాను. అనుకోవటంవేం ముఖ్యం. ముక్తి. తాత్కాలికం. అదే గ్రాహ్యం అప్పటికి!

ఆహా! ప్రపంచంఅంతా మాయతో దొంగతనంతో నిండిపోయిఉంది. జీవితంవేం దానివల్ల ఆచ్ఛాదితంఐంది. దొంగలగుంపు. దొంగలదాడి.

చూడండి, ఒక పెద్దమనిషి ఒకచోటకూర్చుని ఆలోచనలో ఉంటాడు. ఎవరోవచ్చి "ఏంచేస్తున్నారూ" అంటాడు. దానికి జవాబు, "అబ్బే! ఏమీ చేయటంలేదండీ!"

ఏమీచేయకపోవటం ఏంవిటి, బ్రహ్మాండాన్ని ఆక్రమించే ఆలోచన, బహుశా కుళ్లుఆలోచన, చేస్తూ ఎంతో శ్రమపడుతూఉంటే? సంపూర్తిఐన అసత్యం, మాయ, దొంగతనంకాదూ అదీ? కన్నంవేస్తూ పోలీసు ఈలవినబడేటప్పటికి దొరికినసొమ్ములను దాచి పెద్ద మనిషిలా ప్రవర్తించే చోరశిఖామణికి ఈపెద్దమనిషికి ఏమాత్రం భేదం!

తక్కువధరకి అమాయకులదగ్గర, అభాగ్యులదగ్గరకొని ఆ దినుసుల సామాన్యంగా, సామాన్యులకు అలభ్యంగాచేసి వారిని బాధతో అల్లల్లలాడించి విపరీతధరలకు అమ్మి కోటీశ్వరుడైన మోసగాడు మాన్యుడగుతాడు ఏమి చౌర్యం!

భర్త పక్కలో పడుకొని వలపుగానిని తలచుకుంటుంటది ఒకభార్య. భార్య కాళ్లుపడుతుంటే పరకీయమైన ప్రియురాలి కుచకుంభాలను తలచుకుంటుంటాడు ఒకభర్త. ఈ ఇరువురు కూడ స్వకుటుంబంలో మహానందం పొందుతున్నట్లు నటిస్తారు—చోరీ!

ఒక మహామంత్రో, ఒక మహారాజో వస్తే వాళ్ల అవకతవక పనులకి ఈలెంప ఆలెంప వాయించాలని బుద్ధి పుడతది. కాని లేచి భయభక్తులతో వారిని ఆహ్వానించి వారికి సేవ చేస్తారు, లోపలభావాలు కప్పిపెట్టి చాలామంది. ఇదేవిఁటీ?

స్వోదర పోషణార్థం విశ్వోద్ధారకుడుగా సంచరించే మహానుభావుడు మహాచోరుడుకాడా!

బూటకాలుపాడి గారడీ కట్టే కవి, అసందర్భ ప్రలాపాలతో అబద్ధాలాడే వేదాంతి, దొంగల్లో దొంగలు.

ఏప్రెసిడెంటో, ఏప్రైమ్‌మినిస్టరో, సుఖంగా కుర్చీలో కూర్చొని మహాచక్రవర్తి అనుభవం అనుభవిస్తూ మిగతా వాళ్లచే అడ్డమైన పనులూ చేయిస్తూ, వాళ్లరక్తాలతో, ప్రాణాలతో, వాళ్లకుటుంబాల కన్నీళ్లతో మహారణాలునడిపిస్తూ, తామూ నిద్రాహారాలు లేక కష్టపడుతున్నామని, తాముకూడా మామూలు సైనికునిలాగ యుద్ధంచేయాలని ఉన్నదికాని, అంతకన్నా ఘనకార్యం చేస్తూండబట్టి యుద్ధరంగంలో లేవని,

తమ దివ్యసాధమే యుద్ధరంగం అని హద్దూ పద్దూ లేకుండా కలవిస్తూ, తమ మహాత్యాగాన్ని ప్రకటిస్తూఉంటే, చోరాగ్రేసరుని గంభీరమైన బీరాలు జ్ఞాపకం వస్తాయి.

కుళ్లిపోయిన శరీరాన్ని మంచిబట్టలతో కప్పటం, శిథిలంఐన అవయవాలని రంగులు మొదలైనవానితో మసిపూసి మారేడుకాయచేయటం, లోపలివిషాన్ని చిరునవ్వుతో కప్పిపుచ్చటం ఏమిటీ? దొంగతనంలో మొదటి రకం.

కొన్ని దొంగ మాటలని ఈక్రింద ఉదహరిస్తాను.

రాకూడని సమయాన్ని ఎవరైనావస్తే పైకి "దయచేయండి, చాలా సంతోషం" మనసులో "వెధవా, ఇప్పుడు ఎందుకువచ్చావురా? నీవు చస్తే బాగుండును."

అసూయ ఉన్నప్పుడు పైకి "తమ ఔన్నత్యంచూచి నేను పొంగిపోతున్నా" మనసులో "నాకు శరీరం మండిపోతుంది, నీయిల్లు కాలిపోనూ!"

ప్రాణశత్రువు మరణించినప్పుడు పైకి "అయ్యో పాపం, పోయాడా!" మనసులో "బాగా చచ్చేడు లండీకొడుకు, పీడ వదలింది."

తాను గొప్పకార్యం చేసేనని అనుకొన్నప్పుడు పైకి "అబ్బే, నే చేసిందేంవుంది!" మనసులో "నాకన్న గొప్పవాడెవడున్నాడూ! ఎవడీపని చేయగలడూ!"

ందరు ఆనందిస్తారు. (వాళ్ల భార్య ఆమె కాకపోతే) కాని ందరు, "తుచ్ఛుడు, కొంపలు కూల్చేడు, ప్రపంచం భ్రష్టత పొందిపోతుంది" అని నిందిస్తారు. (తమకు అలాంటి అవకాశాలు లేనివాళ్లు.)

"అందరి భార్యలు అందరి భర్తలు, అందరి సొత్తు, అందరివి, అలాంటి ఆ ఆశయాలే అభివృద్ధి మార్గాలని" స్వేచ్ఛా ప్రేమోపాసకుడు, సామ్యవాది, పరిగణిస్తారు - గృహమేధికి, లక్షాధికారికి అవి అభివృద్ధిమార్గాలుగా కనిపించవు.

క్రొత్తకవిత్వం కవిత్వాభివృద్ధి అని నూతనకవిత్వ ప్రియు లంటారు. అది కారుచిచ్చు అని దానిని అసహ్యించుకొనేవారు దానిని దూషిస్తారు.

"సర్వేజనాః సుఖినో భవంతు - అనే వాక్యార్థమే ర్వాభివృద్ధికి, స్వాభివృద్ధికి కారణం అని కొందరు నమ్ముతారు" సోహం బ్రహ్మఅనేదానిలోనే (తనకికోరిక - తరువాతిలో వహరింపబడ్డట్టు) ఇతరులయొక్క - తనయొక్క - అభివృద్ధి ఇమిడి న్నదని మరికొందరు నమ్ముతారు.

మానవజాతి దినదిన ప్రవర్ధమానమై ఇతోధికంభిన భివృద్ధిని పొందుతుందని కొందరు ఉత్సాహం కలవాళ్లు అం డు. రోజురోజుకి అడుగంటిపోతుందని కొందరు నిరుత్సా ంలో మునిగి మూలుగుతారు.

ఏది ఏమైనా, కాలం జరిగిపోతుంది (కాలం అనేది లేక పోయినా! —) ఎవరికిష్టంఐంది వారు అనుకోవచ్చు. ఎవరికిష్టం వచ్చినట్లు వారు తిట్టుకోవచ్చు. ముద్దుపెట్టుకోవచ్చు. ఆట్టే ప్రమాదంలేదు. గిలిగింతలు, చిన్న గిల్లులు, అంతే.

దీనివల్ల అయ్యేది కాకమానదు. కానిది అవ్వనే అవ్వదు — జరిగిపోయేయి, జరిగిపోతున్నాయి నదులు ప్రవహించినట్లు, వర్షం కురిసినట్లు, గాలి వీచినట్లు, సముద్రం హోరుపెట్టినట్లు, మేఘం ఉరిమినట్లు వివిధకాలాల ఆయా స్థలాల మానవ కార్యాలు, మానవ సంఘటనాలు, సాగి పోతున్నాయి.

సాగిపోవటమే అభివృద్ధి, నాకు కదలికే ప్రాణం అదే విశ్వకల్యాణం, విశ్వకల్యాణం. పచ్చతోరణం. ఇలాంటి హృదయ స్థితిలోనే కాబోలు బ్రౌనింగు "ప్రపంచం అంతా బాగా ఉన్నది" అని అనేసేడు.

(ఈ విధం విన దృక్పథం, సింహావలోకనం, — కాని సింహావలోకనంలో ఒకొక్కప్పుడు కొన్ని కొన్ని ముఖ్యవిష యాలు, — చిన్న విషయాలే కానీయండి, తేలుపోటు లాంటివి — గోచరించవు. అలాగే గోచరిస్తే "మొత్తమీద —" అని ప్రారంభించే అన్నిటికీ వర్తించే, అర్థంలేని మొండి వాక్యాలు వెలువడవు)

కదలికే జీవనంగా ఈ అభివృద్ధి సర్వత్రా ముఖ్యమైనది అయింది. స్త్రీలు, బట్టకట్టటం, విస్తారం నుంచి ప్రకృతి శాస్త్రాలు, వేదాంతాలవరకు ఇది వ్యాపించి ఉన్నది.

జనన మరణాలు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, ఆటలు, కొట్లాటలు, నవ్వులు, ఏడుపులు, వలపులు, విరోధాలు, విరహాలు, కలయికలు, ఆర్జన, వ్యాయామం, నిద్ర, కలలు, జాగ్రదవస్థ, కవిత్వం, వేదాంతం, శాస్త్రం, భోజనం, విసర్జనం, రాత్రి, పగలు, వెన్నెల, వడగళ్లు, పిడుగులు, ఇంద్రధనుస్సు, అన్నీ, ఎన్నో, అభివృద్ధి సూచకాలు. ఒకదానిపైనొకటి; ఒకటైన తరువాతనొకటి. అన్నీ కలిసికూడా.

ఇంతకదలిక, ఇంతజీవనం, ఇంతఅభివృద్ధి, ఇంత " ఇంత " మనకోసం ఈలోకంలో - బహుశా ఇంకా ఎన్నో అనంతాలైన లోకాలలోను ఉన్నాయి. మనసృష్టికర్త — మనం అతన్ని సృష్టిస్తేనేం ( హౌస్‌మన్ సూచించినట్లు ) లేక అతని వలన అతనే సృష్టింపబడితేనేం ( స్వయంభూఅని మనపూర్వులన్నట్లు ) — మనకోసం ( మనకోసంఅని అనుకోవటంలో తప్పులేదు ఒక్కొక్కప్పుడు ) ఇంత హడావిడి చేస్తున్నాడు. ఇంత శ్రమ తీసుకుంటున్నాడు. అతడు గొప్పవాడనటంలో ఏమాత్రం సంకోచంలేదు.

కాని, ఒకవేళ అతనిఖేలకోసం, అతని స్వంత అభివృద్ధి

కోసమే [illegible] చేస్తున్నాడేమో! — ఐతేమాత్రం తప్పేం? దేవుడు తనకోసం తానెందుకు అన్నీ చేసుకో కూడదూ?

అదికాకుండా అతన్ని అడిగేవాడెవడూ? — దేవుడికి దేవుడేడీ! —

అది ఎలా ఉన్నా ఉంకోటి అనక తప్పదు. ఇంత అభివృద్ధి మనకండ్లఎదుట సాగిపోతూ ఉన్నా, ఇంకా ఎక్కువ అభివృద్ధి మన అందరికీ ఇష్టం అయ్యేలాగ ఐతే మనం ఇంకా ఎక్కువ సంతోషించుతాము; దేవుణ్ణి ఇంకా ఎక్కువ పొగడుతాము.

## పిఠాపురము యువరాజావారి

### గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| తీరనికోరిక తరువాత | 166 | పేజీలు రు | 1—8—( |
| కంటికీమనసుకీఏదోఅనాలనిఅంటే | 169 | ... | 1—8—( |
| ఆలోకమునుండి ఆహ్వానము | 126 | ... | 1—0—0 |
| "సువిశాలమిదం విశ్వం" | 132 | ... | 1—0—0 |
| చినుకుల చిందులు | 27 | ... | 0—8—0 |
| తరంగములు | 38 | ... | 0—8—0 |
| స్వార్థత్యాగము | 96 | ... | 1—0—0 |
| నామరహితం | 128 | ... | 1—0—0 |
| వరూధినీ ప్రవరాఖ్యము | 71 | ... | 1—0—0 |



వల్లి మద్రు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము